

భారత ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, 68వ జన్మదినోత్సవ సందర్భంగా 'బాల దివసం'
దేశమంతటా జరుపబడింది. ప్రధాని జన్మదినోత్సవం శుభప్రదం కావాలని,
దీర్ఘాయురభివృద్ధులు కలగాలని మా ఆకాంక్ష.

సోవియట్ భూమి, 22వ సంచికకు అనుబంధం. 28, సెప్టెంబరు 1957.

# అక్టోబరు సామ్యవాద మహా విప్లవ నలభైయవ వార్షికోత్సవం

## సోవియట్ దేశ సుప్రీం సోవియట్ వార్షికోత్సవ సమావేశంలో, 1957 నవంబరు 6న యన్. యస్. క్రుష్చెవ్ సమర్పించిన నివేదిక సంగ్రహ పాఠం

నలభై ఏళ్ళ సోవియట్ రాజ్యంలో దేశాభివృద్ధి ముఖ్య ఫలితాలను సమీక్షించి, భావి అవకాశాలను వివరించి, సోవియట్ దేశంలో కమ్యూనిస్టు నిర్మాణ కర్తవ్యాలను నిర్వచించి, అక్టోబరు విప్లవం యొక్క అంతర్జాతీయ ప్రాముఖ్యాన్ని నొక్కి చెప్పి, ప్రపంచ సామ్యవాద శక్తుల అభివృద్ధిని తెలియజేసి, ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితికి సంబంధించిన ముఖ్య సమస్యలను చాలవాటిని యన్. ఎస్. క్రుష్చెవ్ తన నివేదికలో చర్చించారు.



యన్. యస్. క్రుష్చెవ్
సోవియట్ దేశ కమ్యూనిస్ట్ పార్టీ కేంద్రకమిటీ ప్రథమ కార్యదర్శి

తన నివేదిక ప్రారంభంలో, మానవజాతి చరిత్రలో అక్టోబరు సామ్యవాద విప్లవానికి గల బ్రహ్మాండమైన ప్రాముఖ్యాన్ని నొక్కి చెపుతూ యన్. యస్. క్రుష్చెవ్, సోవియట్ల భూమి కార్మిక వర్గం అంతర్జాతీయ శ్రామికోద్యమానికి తానొక ఉపాంగాన్నని సర్వదా పరిగణించుకుంటూ వుందనీ, తన విజయాలను సకల దేశాల శ్రామిక ప్రజల విజయంగానూ, సామ్రాజ్యవాద, వలస విధాన శృంఖలాలనుండి మానవజాతి విముక్తి అనే మహాదాశయానికి, నూతన సామ్యవాద సమాజ నిర్మాణానికి తన సేవగానూ భావిస్తూ వున్నదనీ చెప్పారు.

సామ్యవాద దేశాలన్నిటి నుండీ పార్టీ, ప్రభుత్వ ప్రతినిధి వర్గాలూ, 61 దేశాల నుండి సోదర కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధులూ, ప్రపంచంలోని చాలా దేశాల ప్రతినిధులూ ఉత్సవ వార్షిక సమావేశానికి హాజరయ్యారని ప్రకటిస్తూ యన్. యస్. క్రుష్చెవ్, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గం పేరిట, సోవియట్ దేశ మంత్రి వర్గం పేరిట, కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ పేరిట, సోవియట్ ప్రజలందరి పేరిట ప్రియమైన అతిధులను ఆదర పూర్వకంగా ఆహ్వానించారు.

దేశం నలభై ఏళ్లలో సాధించిన విజయాలను వివరిస్తూ ఎన్.ఎస్. క్రుష్చెవ్, ఏ విప్లవానికైనా సంబంధించిన ముఖ్యమైన మూలమైన విషయం అధికారమని నొక్కి చెప్పారు. పూర్వపు విప్లవాలేవీకూడా, శ్రామిక ప్రజలకు దోపిడీ వర్గాలపైని

విజయాన్ని చేకూర్చలేదు, అవేవీ శ్రామిక ప్రజలకు అధికారాన్ని చేకూర్చలేదు. చరిత్రలో మొదటిసారిగా అక్టోబరు సామ్యవాద విప్లవం శ్రామికప్రజల కనుకూలంగా, ప్రజల కనుకూలంగా శాశ్వతంగా యీ సమస్యను పరిష్కరించింది; తద్వారా ఒక నవ శకాన్ని, సామ్యవాదం, కమ్యూనిజంల విజయ శకాన్ని ఆవిర్భవింపజేసింది.

సోవియట్ పరిపాలనా కాలంలో దేశపు ఆర్థిక ప్రగతిని చిత్రిస్తూ యన్. యస్. కృశ్చేవ్ అనేక విషయాలనూ, అంకెలనూ పేర్కొన్నారు. ముఖ్యంగా, 1913తో సరిపోల్చితే సోవియట్ దేశంలో 1957లో పరిశ్రమంతటి మొత్తం ఉత్పత్తి 33 రెట్లు ఎక్కువయ్యిందనీ, ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి 74 రెట్లు అధికమయ్యిందనీ ఆయన చెప్పారు. సామ్యవాద వ్యవసాయ రంగంలో బ్రహ్మాండమైన అభివృద్ధి సాధింపబడింది. విప్లవానికి పూర్వపురోజులు కంటె వ్యవసాయపు పనులు చేసే జనాభా నిష్పత్తి నూటికి యించుమించు 50 వంతులు తగ్గిపోయినప్పటికీ, అమ్మకానికి పెట్టే వ్యవసాయ వస్తువుల ఉత్పత్తి అనేకరెట్లు పెరిగింది. వ్యవసాయ ఉత్పత్తిలో పెద్ద పెరుగుదలకుద్దేశింపబడిన విస్తృత కార్యక్రమాన్ని పార్టీ, ప్రభుత్వమూ ప్రారంభించినప్పుడు 1953 సెప్టెంబరులో జరిగిన సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం తరవాత గడచిన నాలుగేళ్ళు వ్యవసాయ అభివృద్ధిలో ఒక ముఖ్యమైన దశకు ప్రాతినిధ్యం వహిస్తాయి. బీడు ప్రాంతాలను అభివృద్ధి చేయడంలోనూ, యిటీవలవరకూ కూడా వెనుకబడివున్న పశువుల పెంపకాన్ని అభివృద్ధి చేయడానికి కృషిని చేయడంలోనూ అపూర్వమైన విజయాలను తెలియజేసే అంకెలను యన్. యస్. కృశ్చేవ్ పేర్కొన్నారు.

ఈ విజయాలన్నిటినీ సమీక్షిస్తూ యన్.యస్. కృశ్చేవ్, స్థాపింపబడిన నలభై ఏళ్ళలో సోవియట్ దేశం బలాత్కారంగా తనపైని రుద్దబడిన యుద్ధాలలో పోరాడుతూ, యుద్ధంచే విచ్ఛిన్నం గావింపబడిన జాతీయార్థిక వ్యవస్థను పునరుద్ధరిస్తూ సుమారు రెండు దశాబ్దాలు గడిపింది. హిట్లరు జర్మనీ రాక్షస దండయాత్రవల్ల సోవియట్ దేశ ఆర్థిక వ్యవస్థకు కలిగిన నష్టం 256900 కోట్ల రూబుళ్ళుగా అంచనా వేయబడింది. శాంతియుత నిర్మాణంలో యీ సాధనాలు వినియోగింపబడి వున్నట్టయితే, సోవియట్ దేశం ఎప్పుడో పుష్కలంగా సంపదలు గల దేశమై వుండేది.

అయినా, యిప్పుడు సైతం ప్రజాజీవిత నిరంతరాభివృద్ధిలో బ్రహ్మాండమైన ఫలితాలు సాధింపబడ్డాయి. సహజంగా సోవియట్ దేశంలోని తల ఒక్కింటికీ జాతీయాదాయంలో, 1913లో కంటె 13 రెట్లు పెంపుదల వచ్చింది. తరవాత యన్. యస్. కృశ్చేవ్, సోవియట్ ప్రజల జీవితంలో అభివృద్ధిని చూపడానికి అనేక విషయాలనూ, అంకెలనూ పేర్కొన్నారు.

సామ్యవాదం సాధించిన అత్యంత ఘన విజయాలలో ఒకటి, సోవియట్ దేశంలో సాంస్కృతిక విప్లవమని నొక్కి చెప్పుతూ, యన్. యస్. కృశ్చేవ్ విజ్ఞానశాస్త్రం, ఇంజనీరింగులలో ప్రపంచంలోని అగ్రదేశాలలో సోవియట్ దేశం ఒకటని తెలియజేశారు. పరమాణుశక్తి శాంతియుత వినియోగంలో సోవియట్ దేశానికి గల అగ్రస్థానం గురించీ, యిటీవల జయప్రదంగా జరపబడిన అంతర్ ఖండ బాలిస్టిక్ రాకెట్ పాటవ పరీక్షల గురించి, దేశపు గొప్ప వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి గురించి, దాని ఫలితంగా ప్రపంచపు ప్రథమ మానవ నిర్మిత భూ ఉపగ్రహాలను జయప్రదంగా పంపడం గురించీ ఆయన పేర్కొన్నారు.

సోవియట్ దేశంలో సామ్యవాద నిర్మాణం అక్టోబరు సామ్యవాద మహావిప్లవ ముఖ్యఫలితమని ఉద్ఘాటిస్తూ యన్. యస్. కృశ్చేవ్, సామ్యవాద సమాజం మానవచరిత్రలో అపూర్వమైన నవసమాజమనీ, అది పరస్పర విరుద్ధమైన వర్గాలచే విభజితమై వుండలేదనీ, ఒకే ఆశయాల చేతనూ, ఒకే ప్రయోజనం చేతనూ అది సంఘటితమై వున్నదనీ, తన నాయకమణి అయిన కమ్యూనిస్టు పార్టీ వెనుక నది దృఢంగా సమైక్యమై వున్నదనీ తెలియజేశారు. మార్క్సిజానికి, శ్రామిక వర్గ ప్రయోజనాలకు విభిన్నమైన విరుద్ధమైన వాటన్నిటికీ వ్యతిరేకంగా పోరాటంలో పార్టీ వృద్ధి చెందుతోంది, జవసత్వాలనూ పొందుతోంది.

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ 20వ మహాసభ కమ్యూనిజం వేపుకు సోవియట్ దేశపు పురోగమనంలో, పార్టీ జీవితంలోనూ, స్థూలంగా సోవియట్ ప్రజల జీవితంలోనూ ఒక ముఖ్యమైన మైలురాయి. ఇరవైయవ పార్టీ మహాసభ తీర్మానాలకూ, యీ మహాసభ తయారుచేసిన కమ్యూనిస్టు నిర్మాణ కార్యక్రమాలకూ యావద్దేశమూ, యీ ప్రణాళికలను అమలు జరిపేందుకు మహోత్సాహంతో పని చేస్తోన్న యావత్ప్రజలూ హృదయపూర్వకంగా స్వాగతం చెప్పారు.

ఇరవైయవ పార్టీ మహాసభ సమయంలో జె. వి. స్టాలిన్ వ్యక్తి ఆరాధనకు సంబంధించిన తప్పులపైని తన నియమబద్ధమైన విమర్శనా దండయాత్రను పార్టీ తనకు తానుగానే నడిపి, యీ వ్యక్తి ఆరాధన ఫలితాలను అధిగమించేందుకు చర్యలను సిఫారసు చేసిందని నొక్కి చెపుతూ, యన్. యస్. కృశ్చేవ్ పార్టీ స్థానాలను పటిష్ఠపరచడానికీ, సామ్యవాద వ్యవస్థకు మరింత బలాన్ని యిచ్చేందుకూ, భవిష్యత్తులో యిటువంటి పరిణామాలు రాకుండా నిరోధించేందుకూ యిది చేయబడిందనీ చెప్పారు. "కాని వ్యక్తి ఆరాధనపై జరిగే విమర్శను సామ్యవాద వ్యవస్థ మీదనూ, కమ్యూనిస్టుపార్టీ మీదనూ దాడి చేయడానికి ఉపయోగించేందుకు ప్రయత్నిస్తున్న వారితో మనం ఏకీభవించజాలము" అని కృశ్చేవ్ అన్నారు. "స్టాలిన్ కార్యకలాపాలలోని తప్పుడు

విషయాలను విస్మరిస్తూనే పార్టీ, స్టాలిన్‌పైని దుష్ప్రచారం చేసేవారిని, వ్యక్తి ఆరాధనను విమర్శించే సాకుమీద, జె. వి. స్టాలిన్ కేంద్రకమిటీకి అధిపతిగా వున్నప్పుడు మన పార్టీ కృషిలో ఒక యావత్తు చారిత్రక దశను తప్పుగా చిత్రించే వారందరితో తీవ్రంగా పోరాడుతుంది. విధేయుడైన మార్క్సిస్టుగా, లెనినిస్టుగా, గట్టి విప్లవకారుడుగా స్టాలిన్‌కు చరిత్రలో తగిన స్థానం లభిస్తుంది. మన పార్టీ, సోవియట్ ప్రజలూ స్టాలిన్‌ను జ్ఞాపకముంచుకుంటారు, ఆయనను ప్రశంసిస్తారు," అన్నారు కృశ్చేవ్.

మార్క్సిజం-లెనినిజం నుండి దూరం తొలగడాన్ని, దాని సారాంశాన్ని పెడార్థాలతో చిత్రించడానికి జరిగే ప్రతి ప్రయత్నాన్నీ, సామ్యవాదం కమ్యూనిజాలకై సాగే పోరాటంలో మన దీక్షను బలహీనపరిచే వారందరినీ, మన ఐక్యతనూ, సంఘీభావాన్నీ దెబ్బకొట్టి బలహీన పరచదలచుకున్నవారందరినీ పార్టీ తీవ్రంగా ఎదుర్కొని పోరాడింది, ముమ్ముందుకూడా పట్టుదలగా పోరాడుతుంది.

సోవియట్ సమాజం మహా వేగంతో అభివృద్ధి చెందుతోంది. నిర్దిష్టమైన అభివృద్ధి దశలలో, సామ్యవాద నిర్మాణంలోని ఏవో కొన్ని శాఖల నిర్వహణ రూపాలను బాగుపర్చవలసిన అవసరం వస్తుంది. ఛాందసత్వానికీ, వెనుకబాటు తనానికీ వ్యతిరేకంగా దీక్షగా పోరాడుతూ వుందనీ, కృతక రూపాలను తిరస్కరించి, నిరంతరాభివృద్ధి అవసరాలకు అనుగుణమైన నూతన రూపాలను పెంపొందిస్తూ వుందనీ మన పార్టీ యావత్తూ చరిత్ర తెలియజేస్తోంది.

సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ 20వ మహాసభ ఆమోదించిన విధానాన్ని వ్యతిరేకించినటువంటీ, మన పార్టీ లెనినిస్టు ఐక్యతను బలహీన పర్చడానికి ప్రయత్నించినటువంటీ మాలెంకోవ్, కగనోవిచ్, మొలటోవ్ పార్టీ వ్యతిరేక ముఠామీద, తదుపరి వారిని చేరిన షెపిలోవ్ మీద సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ జూన్ ప్లీనరీ సమావేశం చేసిన నిర్ణయానికి దేశ వ్యాప్తంగా వచ్చిన ఆమోదం, కమ్యూనిస్టుపార్టీ విధానాన్ని సోవియట్ ప్రజలు ఏకగ్రీవంగా బలపరుస్తున్నారన్న విషయాన్ని స్పష్టంగా వెల్లడిస్తూంది.

సోవియట్ దేశంలోని కమ్యూనిస్టు నిర్మాణావకాశాల గురించి, కర్తవ్యాల గురించీ మాటాడుతూ యన్. యస్. కృశ్చేవ్, పార్టీ యిరవైయవ మహాసభ సూచించిన ఆర్థిక, సాంస్కృతిక నిర్మాణ కార్యక్రమం, జాతీయార్థిక శాఖలన్నిటి పురోభివృద్ధిలో ఒక గొప్ప ముందడుగును సూచిస్తుందని ఉద్ఘాటించారు. 1959-1965కు ఇప్పుడు తయారీలోవున్న సోవియట్ దేశ దీర్ఘకాల జాతీయార్థిక ప్రణాళిక సాఫల్యం, ముఖ్య ఆర్థిక సమస్య పరిష్కారాన్ని—అధికంగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో తల ఒక్కింటికి ఉత్పత్తిలో, అత్యంత అల్పమైన చారిత్రిక దశలో చేరుకోవడానికీ, మించడానికీ—మనకు చేరువగా తీసుకవస్తుంది.

సోవియట్, అమెరికా దేశాలలోని చాలా ముఖ్యమైన కొన్ని వస్తువుల ఉత్పత్తి స్థాయికి సంబంధించిన కొన్ని అంకెలను యన్. యస్. కృశ్చేవ్ పేర్కొన్నారు. రానున్న పదిహేనేళ్ళలో సోవియట్ దేశం, అమెరికాలోని చాలా ముఖ్యమైన వస్తువుల ప్రస్తుత ఉత్పత్తి స్థాయిని చేరుకొని, మించిపోగలదని ప్లానింగ్ ఉద్యోగుల అంచనాలు సూచిస్తున్నాయి.

ఇంకా కచ్చితంగా నిర్వచింప బడవలసిన ప్రాథమిక ప్లానుల ప్రకారం, సుమారు 15 సంవత్సరాలలో తన వార్షిక పారిశ్రామిక ఉత్పత్తి యీ దిగువ స్థాయిలను అందుకోవాలి: ముడి ఇనుము—25-30 కోట్ల టన్నులు, పిగ్ ఐరన్ 750-850 లక్షల టన్నులు, ఉక్కు 10-12 కోట్ల టన్నులు, బొగ్గు 65-75 కోట్ల టన్నులు, నూనె 35-40 కోట్ల టన్నులు, గేస్ తీత, ఉత్పత్తి 27000-32000 కోట్ల ఘనమీటర్లు, విద్యుచ్ఛక్తి 80000-90000 కోట్ల కిలోవాట్ గంటలు, సిమెంటు 9-11 కోట్ల టన్నులు, పంచదార 90-100 లక్షల టన్నులు, ఉన్ని బట్టలు 55-65 కోట్ల మీటర్లు, తోలు చెప్పులు 60-70 కోట్ల చెప్పులు,

సహజంగా, అమెరికాలో కూడా ఆర్థికాభివృద్ధి కొనసాగవచ్చును, కాని మన పరిశ్రమ పెరుగుదల రేట్లు అమెరికా పరిశ్రమలోకంటె యెక్కువ కావడంవల్ల, సాధ్యమైనంత అత్యల్ప కాలంలో శాంతియుతమైన పోటీలో అమెరికాను మించిపోయే అవకాశం వాస్తవంగానే కనిపిస్తోంది.

కీలక పరిశ్రమలు యించుమించు నూటికి 100-200 వంతులు పెరగడమూ, రానున్న 15 ఏళ్ళలో వ్యవసాయంలో పెద్ద అభివృద్ధి, రానున్న 10-15 ఏళ్ళలో యిళ్ళ కొరతను అంతం చేయడాన్ని సాధ్యంచేసే పెద్ద సంఖ్యలో అదనపు యిళ్ళు—యివన్నీ ప్రజల జీవన ప్రమాణంలో పెద్ద అభివృద్ధిని తీసుక వస్తాయి,

ప్రస్తుత దశలో సోవియట్ దేశం ఎదుటనున్న కర్తవ్యాల గురించి ప్రస్తావిస్తూ, సామ్యవాద దేశం శాశ్వతంగా నిర్వికల్పమైన, ఉన్న రూపంలోనే గడ్డకట్టుకుని వుండిపోలేదని కృశ్చేవ్ ఉద్ఘాటించారు. కమ్యూనిజానికి చేరువగుతూ వున్నకొద్దీ అది పెంపొందుతూ వుంది, మారుతూ వుంది. సామ్యవాద ప్రజాస్వామ్యం, ప్రజల, శ్రామిక ప్రజల నిజమైన ప్రభుత్వం నిరంతరం విస్తరింపబడుతూ, లోలోతులకు వేరూనుతూ వుంది. ఆర్థిక సాంస్కృతిక రంగాలలో యూనియన్ రిపబ్లిక్కుల అధికారాన్ని విస్తరింపజేయడానికీ, స్థానిక చొరవను ప్రోత్సహించడానికీ, పారిశ్రామిక నిర్వహణను పునర్నిర్మించడానికీ గత కొలది ఏళ్ళలో తీసుకోబడిన చర్యలు సామ్యవాద ప్రజాస్వామ్య అభివృద్ధిలో ఒక పెద్ద ముందడుగు వేయబడిందని సూచిస్తాయి.

రాజ్యయంత్రం గురించి మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం, సంపూర్ణమైన కమ్యూనిజంవేపుకు సమాజం పురోగమించడంతో అది గతించిపోవడం, గొప్ప ప్రాముఖ్యం గల విషయం. సోవియట్ దేశ ఆంతరంగిక పరిణామం దృష్ట్యా చూస్తే, రక్షణ గురించీ, శత్రు శక్తులకూ, వారి తాబేదార్లకూ వ్యతిరేకంగా సామ్యవాద రక్షణకు సంబంధించిన శాఖల పరిపోషణ గురించి పెట్టే పెద్ద ఖర్చులను తిరిగి కేటాయించడమూ, వాటి సత్వర ఆర్థికాభివృద్ధికీ, ప్రజలకు యింకా ఉన్నతమైన జీవన ప్రమాణాన్ని సృష్టించడానికీ ఉపయోగించడమూ పూర్తిగా సుసాధ్యం, చాలా యుక్తమైన విషయం. అయినా, దురదృష్టవశాత్తూ సామ్రాజ్యవాద దేశాల పాలకుల విరోధ విధానాలూ, కార్యాలూ మేము తిరిగీ యీ కేటాయింపు జేయడానికి అవకాశం కలిగించడం లేదు.

సామ్యవాదానికి శత్రువులైనవారి కుతంత్రాల గురించీ, మరొక యుద్ధాన్ని ప్రారంభించడానికి వారి ప్రయత్నాలగురించీ రాజకీయంగా జాగరూకతతో వుండడమూ, దేశరక్షణ శక్తినీ, దాని సాయుధబలాలనూ సర్వవిధాలా పటుతరం చేయడం—వేటినిగూర్చి సోవియట్ రాజ్యం ప్రత్యేక శ్రద్ధ వహిస్తూంది, ముమ్ముందు వహిస్తుందికూడా.

సోవియట్ సేన, నౌకా బలం సర్వప్రజల ఆదరాభిమానాలను చూరగొంటూ వున్నవనీ, సోవియట్ సైనికుల ఉన్నతమైన నైతిక శక్తిలోనూ, వారి ఉన్నతమైన దేశభక్తి చైతన్యంలోనూ, సామ్యవాద మాతృభూమి పట్ల అధికమైన విధేయతలోనూ వాటిబలం యిమిడి వున్నదని చెపుతూ కృశ్చెవ్ యిలా అన్నారు: "తన తీర్మానాలలో సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీయొక్క యిటీవలి ప్లీనరీ సమావేశం ఉద్ఘాటించినట్టుగా మన సేనయొక్క, నౌకా బలంయొక్క శక్తికి మూలాధారం, వాటికి కమ్యూనిస్టుపార్టీ నిర్మాతగా, నాయక సంస్థగా, విద్యా బుద్ధులను గరిపే సంస్థగా వుండడమే."

ప్రపంచ సామ్యవాద విప్లవశక్తులకు అక్టోబరు విప్లవం యొక్క అంతర్జాతీయ ప్రాముఖ్యతగురించి చెబుతూ కృశ్చెవ్, గడచిన నలభై ఏళ్ళలో ప్రపంచకమ్యూనిస్టు, కార్మికవర్గ ఉద్యమం త్వరత్వరగా అభివృద్ధి పొంది విస్తరించిన దశ అన్నారు. విప్లవ పోరాటంలో పెరిగి కాకలుతీరిన మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల్లో యిప్పుడు 3 కోట్ల 30 లక్షల మంది సభ్యులు సంఘటితమై వున్నారు.

అక్టోబరు మహావిప్లవం తరవాత, చైనాలో విప్లవ విజయం, చైనా ప్రజారిపబ్లిక్కు నిర్మాణం చరిత్రలో అతి ముఖ్యమైన ఘటన. అల్బేనియా, బల్గేరియా, హంగెరీ, వియత్నాం ప్రజాస్వామిక రిపబ్లిక్, కొరియా ప్రజాతంత్ర ప్రజాస్వామిక రిపబ్లిక్, జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్, మంగోలియా ప్రజా రిపబ్లిక్, పోలెండ్, రుమేనియా, చెకోస్లొవేకియా, యుగోస్లావియా ప్రజలు సామ్యవాద నిర్మాణ పథాన్ని చేపట్టారు. నేడు ప్రపంచ సామ్యవాద శిబిరం, ప్రసిద్ధి గాంచుతోన్న మహత్తర శక్తి; అది నిరంతరం బలపత్తరం అవుతోంది. దీనిలో ప్రపంచంలోని వాగ్గు నూటికి 37 వంతులకు పైగానూ, దుక్క ఇనుము, ఉక్కు సుమారు నూటికి 25 వంతులూ, ప్రపంచపు పత్తి పంటలో సుమారు మూడింట ఒకవంతు ఉత్పత్తి అవుతోంది. ప్రపంచపు మొత్తం పారిశ్రామికోత్పత్తిలో సామ్యవాద దేశాల భాగం, సుమారు మూడింట ఒకటోవంతుగా వుంది.

ప్రజా ప్రభుత్వ విజయమూ, పరస్పర సోదర సహాయమూ, సామ్యవాద పారిశ్రామిక విధానాన్ని నిరంతరం అనుసరించడమూ, పెట్టుబడిదారీ వ్యవస్థనుండి సంక్రమించిన ఆర్థిక వెనుకబాటు తనమనే దిగ్బంధంనుంచి చాలమంది బయట పడడానికి అవకాశాన్ని కలిగించాయి. సత్వర ఆర్థికాభివృద్ధి గతి సామ్యవాద దేశాల సహజ లక్షణం. వాటి పారిశ్రామికాభివృద్ధి 1956లో, 1937 కంటె నాలుగురెట్లకు పైగా జరిగింది.

సామ్యవాద దేశాల నాయకశక్తి వాటి మార్క్సిస్టు-లెనినిస్టు, కార్మిక పార్టీలు. ప్రస్తుతం శ్రామికవర్గ విప్లవ పార్టీలను ప్రధానంగా అధికతర ఐక్యతకొరకూ, మార్క్సిజం-లెనినిజం సూత్రాధారంగా సహకారరూపాలను విస్తృతం చేయడం కొరకూ కృషి చేయడానికి పరిణామ పథమంతా విధాయకం చేస్తోంది. సామ్యవాద అంతర్జాతీయతా సూత్రాలకు అనుగుణంగా కమ్యూనిస్టు, కార్మిక పార్టీలు రివిజనిస్టు ధోరణులకూ, జాతీయ సంకుచితత్వం, వేరుగా వుండడం అనే అనర్థకాలైన అపోహలకు వ్యతిరేకంగా తమ శ్రేణులను దిట్టపర్చుకునేందుకు పోరాడుతూవున్నాయి.

సమకాలీనులైన రివిజనిస్టులను బట్టబయలుచేస్తూ యస్. యస్. కృశ్చెవ్, కమ్యూనిస్టులమని చెప్పుకునే కొందరు నాయకులు సామ్రాజ్యవాద తాత్త్వికుల ప్రచారపు ఎరకు పరవశులైపోయి, శ్రామికవర్గ నియంతృత్వం లేకుండా, కార్మికవర్గమూ, దాని అగ్రశ్రేణి అయిన కమ్యూనిస్టు పార్టీ సాంఘిక జీవనాన్ని నడపకుండా, శ్రామిక వర్గ అంతర్జాతీయ సూత్రాలు అమలు జరపకుండా సామ్యవాదాన్ని ప్రతిపాదిస్తున్నారు. ఈ అధునాతన రివిజనిజం యొక్క బాట ఎక్కడికి దారితీస్తుందో సామ్యవాద ఆశయానికీ, తమ దేశాల మూల జాతీయ ప్రయోజనాలకూ నేరుగా ద్రోహంచేసే వరకూ దిగజారిన జిలాస్, ఇమ్రె నాగీ దృష్టాంతాలనుబట్టి తెలుసుకోవచ్చును. యుగోస్లావియాలోని, హంగెరీలోని యీ సామ్యవాద శత్రువుల రాజకీయ, తాత్త్విక స్థానాల విచ్ఛిత్తి, యీ దేశాలలో సామ్యవాదాన్ని, యావత్తు సామ్యవాద వ్యవస్థను దిట్టపర్చుతుంది.

సామ్యవాద శత్రువులు సామ్యవాద దేశాలను, ఒకదాని వెంబడిని ఒకదానికి దెబ్బ కొట్టడానికి. ఆ ప్రకారంగా యావత్తు

సామ్యవాద శిబిరాన్ని బలహీనపరచడానికి ప్రయత్నిస్తాయని తెలియజేస్తూ యన్. యస్. కృశ్చెవ్ యిలా అన్నారు: కమ్యూనిస్టులు ఏదో ఒక పూర్తిగా "కొత్త" వైన వేరువేరు దేశాలకు సామ్యవాదానికి కృత్రిమ మార్గాలను అన్వేషించేందుకు, సోవియట్ దేశంలోనూ, చైనాలోనూ, ఇతర దేశాలలోనూ సామ్యవాద నిర్మాణానుభవాన్ని తిరస్కరించేందుకూ సామ్యవాద శత్రువులు ఆశిస్తూ కలలు గంటున్నారు. ఒకొక్క దేశం సామ్యవాదం వేపుకు ఒంటరిగా, తనకుతానే, యితరులతో కలవకుండా, విభిన్న మార్గాలలో ప్రయాణించాలని వారు చెపుతున్నారు. ఈ దృక్పథం ఆమోదింపబడినట్టయితే, ఎన్ని "మార్గాలు" వస్తాయంటే, ప్రజలు అడవులలోవలె త్రోవతప్పి తిరుగులాడి, తమ మహాగమ్యాన్ని కానకుండా పోతారు. కాని యీ అంచనాలు విఫలం కాకతప్పవు. సామ్యవాద శత్రువుల కూహకాలను కనిపెట్టి కమ్యూనిస్టు, కార్మిక పార్టీలు వారికి గట్టి దెబ్బకొడతాయి. అవి మార్క్సిస్టు-లెనినిస్టు స్థానాలను గట్టిగా అంటిపెట్టుకుని వుంటాయి. రాజమార్గంనుండి తమ్ము ఎవ్వరూ తప్పించకుండా అవి చేస్తాయి. సామ్యవాద ఉద్యమాన్ని లోపలనుంచి దెబ్బకొట్టడానికీ, సామ్యవాద దేశాలను, పార్టీలను బలహీనపరచి వాటిలో పరస్పర వైషమ్యాలను కలిగించడానికీ ప్రయత్నాలు చెయ్యడం ప్రపంచ సామ్యవాద వ్యవస్థమీద సామ్రాజ్యవాదమూ, దాని ఏజంట్లు సాగించే పోరాటంయొక్క అతి సున్నితమైన రూపాలలో ఒకటి. ఇది ఒక ముఖ్య ప్రమాదం. దీనికి వ్యతిరేకంగా మనం తీవ్రంగా పోరాడాలి.

పెట్టుబడిదారీ శిబిరంలోని దేశాల పరిస్థితిగురించి మాటాడుతూ కృశ్చెవ్, ఆ దేశాలలో దోపిడీ తీవ్రతరం గావడం గురించీ, శ్రామిక ప్రజల జీవన ప్రమాణం, ప్రజాస్వామిక హక్కులపైని దాడి గురించి, ఫాసిజం యొక్క, యుద్ధం యొక్క ప్రమాదం రానురాను ఎక్కువ అవుతూ వుండడం గురించీ ప్రసంగించారు. కాని ఆ దేశాలకు శ్రామికవర్గమూ, కార్మిక ప్రజలలోని యితర విభాగాలూ, అభ్యుదయకర మేధావులూ వున్నారు; అంటే సామ్యవాద, ప్రజాస్వామ్య దృక్పథాలకు స్థూలంగా కట్టుబడివుండే శక్తులన్నమాట. భవిష్యత్తు యీ శక్తులదేననడం నిస్సందేహం.

పెట్టుబడిదారీ విధాన సంక్షోభం తీవ్రతరం కావడం, ముఖ్యంగా వలసవ్యవస్థ విచ్ఛిత్తిలో ద్యోతకం అవుతోంది. సిగ్గుచేటయిన యీ వ్యవస్థ సంపూర్ణ నాశనానికి, పరిణామాలు దారిచేస్తున్నాయి. భారత దేశం, ఇండొనీషియా, బర్మా, ఈజిప్టు, సిరియా, యింకా కొన్ని దేశాలలో విముక్తి సమరం ఫలసిద్ధిని పొందింది. వలస దాస్యాన్ని త్యజించిన ప్రాచ్యఖండ దేశాలు తమ ఆర్థిక, సంస్కృతి సత్వర పునరుజ్జీవనకు మార్గాలనన్వేషిస్తున్నాయి. అన్ని వలస, పరాధీన దేశాలలో జాతీయ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకొరకు ప్రజల ఉద్యమం వ్యాపిస్తూవుంది.

ఏవిధంగానైనా ఆసియా, ఆఫ్రికా దేశాలలో తమ పాలనను పొడిగించడానికి సామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తున్నారు, వలస రాజ్యాధిపతుల బలం యింకా తక్కువగా లేదన్నదీ, ప్రాచ్యఖండ ప్రజలకుగల ప్రమాదాలను తక్కువగా అంచనా వేయరాదన్నదీ నిజమే. కాని ప్రాచ్యఖండంలో సామ్రాజ్యవాద పరిపాలనకు సాయంసంధ్యాసమయం ఆసన్నమవుతూ వున్నదని, కాదన వీలుకాని చారిత్రక సత్యాలు సూచిస్తున్నాయి.

ప్రాచ్యంలో సామ్యవాద జ్యోతులైన భాగ్యవంతమైన మధ్య ఆసియా సోవియట్ రిపబ్లిక్కులను స్థాపించిన సోవియట్ దేశ దృష్టాంతమూ, చైనా ప్రజా రిపబ్లిక్, తదితర సామ్యవాద దేశాల దృష్టాంతమూ యొక్క మహత్తర ఆకర్షణశక్తి, ప్రాచ్య ప్రజలకు వారి స్వేచ్ఛా స్వాతంత్ర్య పోరాటంలో ఉత్తేజాన్నిస్తూంది. శాంతికాముక ప్రజలందరి ప్రయోజనాలకు అనుగుణమైన న్యాయవంతమైన విధానాన్ని దీక్షతో అనుసరిస్తోన్న సోవియట్ దేశమూ, అన్ని సామ్యవాద దేశాలూ ఆసియా, ఆఫ్రికా దేశాలకు నిజమైన మిత్రదేశాలు.

తన ప్రసంగాన్ని సాగిస్తూ కృశ్చెవ్, విభిన్న సాంఘిక వ్యవస్థలలో కూడిన దేశాల శాంతియుత సహజీవనం, సోవియట్ విదేశాంగ విధానమున్న యదార్థ విషయాన్ని ప్రత్యేకంగా ఉద్ఘాటించారు. సామ్యవాదం, పెట్టుబడిదారీ విధానమూ ఒకే గోళంపైని వున్నాయి; వాటి సహజీవనం చారిత్రికంగా అనివార్యమైనది.

"పెట్టుబడిదారీ దేశాలతో శాంతియుత సహజీవన విధానాన్ని మేము బలపర్చుతున్నాము; శాంతిని దృఢపర్చడం కోసం ద్విపక్ష స్నేహ ఒడంబడికలకూ, యూరప్ ఆసియాలలో సమిష్టి భద్రతా ఒడంబడికలకూ మేము అనుకూలురము. శాంతియుతమైన పోటీపైని ఆధారపడిన, యుద్ధ విరహితమైన జీవితం — శాంతియుత సహజీవనానికి యిదే పునాది" అన్నారు కృశ్చెవ్.

సోవియట్ దేశం నిరంతరం తన శాంతి విధానాన్ని అనుసరిస్తూ, నిరాయుధీకరణ సమస్యకు సంబంధించిన అన్ని విషయాలపైన పాశ్చాత్య రాజ్యాలతో పరస్పర అంగీకార యోగ్యమైన ఒడంబడికలను సాధించడానికి పాటుపడుతున్నది. పాశ్చాత్య దేశాలుకూడా చేయడానికి సిద్ధంగా వున్నట్లయితే, సోవియట్ దేశం తగినంతగా ఆయుధాలను, సాయుధబలాలనూ తగ్గించడానికీ, అణు, ఉదజని ఆయుధాలను నిషేధించడానికీ, అంతర్జాతీయ కంట్రోలు స్థాపితమైనట్లయితే, అణు, ఉదజని ఆయుధ పాటవపరీక్షలను తక్షణం విరమించడానికీ సంసిద్ధంగా వున్నది. మా దేశం యేనాటికీ వెనుకంజ వేయదు.

సోవియట్ దేశం, దేశాలమధ్య సంబంధాల విషయంలో వుంటున్న ఉద్రిక్తతను తగ్గించే తన విధానాన్నీ, సోవియట్ దేశం, అమెరికాల మధ్య పరస్పర అవగాహన మొత్తం అంతర్జాతీయ పరిస్థితిని మౌలికంగా బాగుచేయగలిగినంతవరకు అమెరికాతో సహా అన్ని దేశాలతో సంబంధాలను బాగుపర్చుకొనే తన విధానాన్నీ క్రమం తప్పకుండా అనుసరిస్తూనే వుంటుంది. యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ, శాంతియుత సహజీవనాన్ని అంగీకరించే దేశాలన్నిటితోను సత్సంబంధాలను కలిగి వుండడానికి సోవియట్ దేశం అభిలషిస్తుంది. అలాంటి సంబంధాలను స్థాపించుకోడానికి సర్వ ప్రయత్నాలు చేస్తుంది. యుద్ధానికి దారితీసే "బలాధిక్యతా స్థానాల" విధానం విసర్జింపబడుటద్వారా ఇది సాధ్యమవుతుంది.

ప్రస్తుతం ఉన్న ఉద్రిక్తతను తగ్గించడానికి బదులు, దానిని మరింత తీవ్రతరం చేయడానికీ, అధికాయుధోత్పత్తి పోటీని ఇంకా యెక్కువ చేయడానికీ మార్గాలను అన్వేషించడానికి ఈమధ్య అమెరికా, బ్రిటన్‌ల రాజకీయ నీతిజ్ఞులు ప్రత్యేకంగా సమావేశమయిన విషయాన్ని ప్రస్తావిస్తూ ఎన్. ఎస్. కృశ్చెవ్ ఇలా అన్నారు: వాస్తవికతను గుర్తిస్తూ, పరస్పర అవగాహన ప్రాదిపదికమీద, అంతర్జాతీయ సమస్యల పరిష్కారానికి ఒక పద్ధతిగా యుద్ధాన్ని పూర్తిగా తిరస్కరించడం గురించీ, "ప్రచ్ఛన్నయుద్ధా"నికీ, ఆయుధోత్పత్తికీ స్వస్తి చెప్పడంగురించీ, సహజీవనం ప్రాతిపదికమీద అంతర్జాతీయ సంబంధాలను నెలకొల్పడం గురించీ, సిద్ధాంత వివాదాలను యుద్ధం ద్వారా కాకుండా, ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధిని సాగించడంలోనూ, మానవ అవసరాలను సాధ్యమైనంత పూర్తిగా యీడేర్చడంలోనూ, శాంతియుత పోటీద్వారానూ, పరిష్కరించడం గురించీ ఒప్పందానికి రావడానికై పెట్టుబడిదారి దేశాల, సామ్యవాద దేశాల ప్రతినిధుల శిఖరాగ్ర సమావేశం జరగాలని మా వాంఛ."

ప్రస్తుత దశలో అంతర్జాతీయ సంబంధాలను బాగుపర్చుకోడానికి శాంతియుత సహజీవన విధానం ఒక్కటే సక్రమమైన మార్గమని ఉద్ఘాటిస్తూ ఎన్. ఎస్. కృశ్చెవ్ ఇలా అన్నారు: "విభిన్న సాంఘిక వ్యవస్థలుగల దేశాలమధ్య శాంతియుత సహజీవన విధానాన్ని ప్రతిపాదిస్తున్నప్పటికి, సామ్యవాదానికీ, పెట్టుబడిదారి విధానానికీ మధ్య వైరుధ్యాలు లేవనీ, వాటి మధ్య సంపూర్ణ సామరస్యం సాధ్యమనీ, కమ్యూనిస్టు, బూర్జువా సిద్ధాంతాలకు సమాధానం చేకూరుతుందనీ రూఢిగా చెప్పడం మా ఉద్దేశ్యం మాత్రం కాదు. ఈ దృక్పధాన్ని కలిగి వున్నవారెవరైనా సరే మార్క్సిజం-లెనినిజంనుండి దూరమైన వారవుతారు. సైద్ధాంతిక విభేదాలలో సమాధానం కలుగజాలదు. అవి అలా ఉంటూనే ఉంటాయి. కాని అంతమాత్రంలో శాంతియుత సహజీవనం సాధ్యం కాదనీ, సామ్యవాద దేశాలు, పెట్టుబడిదారి దేశాల మధ్య శాంతియుత పోటీ కొనసాగజాలదనీ అనడానికి వీల్లేదు."

కృశ్చెవ్ తమ ఉపన్యాసాన్ని కొనసాగిస్తూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మికోద్యమాలలో కలిగిన మహత్తర సైద్ధాంతిక, రాజకీయ చైతన్యంలో మనం భాగస్వాములుగా ఉంటూ. స్వయంగా చూస్తున్నామని అన్నారు. కోటానుకోట్ల ప్రజలు నేడు మార్క్సిజం-లెనినిజం యొక్క మహోజ్జ్వల పతాకక్రింద, పోరాటాల్లో కాకలుదీరిన తమ కమ్యూనిస్టు, కార్మిక పార్టీల నాయకత్వంక్రింద కమ్యూనిజం వైపున పురోగమిస్తున్నాయి. సోషలిస్టు విప్లవాన్ని జరిపించడంలో సోవియట్ దేశ కార్మికవర్గం మొట్టమొదటిదైనందుకు మేమెంతో గర్విస్తున్నాము; మా దేశం, మహోజ్జ్వల లెనినిస్టు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం క్రింద సోవియట్ మహాప్రజ, కమ్యూనిజం వైపుకు జరుగుతున్న పురోగమనంలో అగ్రగాములుగా ఉంటున్నందుకు మేము గర్వపడుతున్నాము."

ఎన్. ఎస్. కృశ్చెవ్ తమ ఉపన్యాసాన్ని ముగిస్తూ యిలా అన్నారు: "మాస్కో క్రెమ్లిన్ గోపురాలపైన అరుణ తారలు మహోజ్జ్వలంగా ప్రకాశిస్తూ ఉంటాయని ఇదివరకు అంటుండేవారు. కాని ఇప్పుడు కొత్త తారలు, సోవియట్ ప్రజల సృజనాత్మక కృషితో నిర్మింపబడి రోదసిలోకి ఎగురవేయబడిన కృత్రిమ ఉపగ్రహాలు మెరుస్తున్నాయి. ఈ కృత్రిమ ఉపగ్రహాలు అభ్యుదయానికి వైతాళికులు, సోవియట్ విజ్ఞానశాస్త్రం, ఇంజినీరింగుల విజయం యొక్క వైతాళికులు. అవి రోదసి యొక్క సహపాంథులు (స్పూత్నిక్‌లు) అని సరిగ్గానే పిలువబడుతున్నాయి. భూగోళం చుట్టూ పరిభ్రమిస్తున్న సోవియట్ స్పూత్నిక్‌లు, మార్క్సిజం-లెనినిజం పతాక క్రింద నూతన జీవితాన్ని నిర్మించుకొంటున్న సోవియట్ దేశ ప్రజలు అందుకొన్న వైజ్ఞానిక, ఇంజినీరింగు స్థాయినీ, జాతీయార్థిక స్థాయినీ ప్రకటిస్తున్నాయి.

"సోవియట్ దేశం ఐదవ దశాబ్దంలో కాలిడుతున్నది. మన భవిష్యత్తు మన ముందు స్పష్టంగానూ, మహోజ్జ్వలంగానూ ఉన్నది. అపరిష్కృత సమస్యలపైన మన దృష్టిని కేంద్రీకరించడమే అక్టోబరు విప్లవాన్ని జరుపుకొనే ఉత్తమమైన విధానమని వ్లాదిమిర్ ఇలిచ్ లెనిన్ అన్నమాటలను మేము పవిత్రంగా గౌరవిస్తాము."

"పార్టీ, ప్రజలు యీ సమస్యలను గట్టి నమ్మకంతోనూ, తమ నిర్మాణశక్తుల, రాబోయే కమ్యూనిస్టు విజయంలో గొప్ప విశ్వాసంతోను పరిష్కరించుకొనడం జరుగుతున్నది."



# మావ్ సే-టుంగ్ ఉపన్యాసం

(సంగ్రహ పాఠం)

సోవియట్ దేశ సుప్రీం సోవియట్ ఉత్సవ సమావేశం సాయంత్రం నాలుగు గంటలకు తిరిగి ప్రారంభమయి నప్పుడు చైనా ప్రతినిధివర్గ నాయకుడు మావ్ సే-టుంగ్ ఉపన్యసించారు. ఆయన ఇలా అన్నారు :

సోవియట్ ప్రజల విజయాలలో తమ భవిష్యత్తును దర్శిస్తున్నారు ప్రపంచ ప్రజలు. సోవియట్ దేశం నడిచిన మార్గం, అనగా అక్టోబరు విప్లవపు మార్గం, మానవాళి అంతటి ప్రగతికి దోహద మిచ్చింది. వివిధ దేశాలలోని శ్రమిక విప్లవకారులు, రష్యన్ విప్లవానుభవాలనూ, సోవియట్ దేశంలోని శ్రమిక వర్గ నియంతృత్వం, సోషలిస్టు నిర్మాణాల అనుభవాలను అలక్ష్యం చేసి, ఆ అనుభవాన్ని సూక్ష్మంగా పరిశీలించి, సృజనాత్మకంగా తమ దేశాల్లోని ప్రత్యేక పరిస్థితులకు అన్వయించక పోయినట్లయితే వారు, విప్లవం, దేశ నిర్మాణాలకు సంబంధించిన సమస్యలను సరియైన విధంగా పరిష్కరింపజాలరని మావ్ సే-టుంగ్ అన్నారు.



మావ్ సే-టుంగ్

మావ్ సే-టుంగ్ ఇంకా యిలా అన్నారు : చిట్టచివరికి పెట్టుబడిదారీ వ్యవస్థను అధిగమించగల సోషలిస్టు వ్యవస్థ ప్రజాభిలాషతో ప్రమేయంలేని ఒక వాస్తవ సూత్రం. అభివృద్ధి నిరోధకులు చారిత్రకాభివృద్ధిని అరికట్టడానికి యెంత ప్రయత్నించినా విప్లవం తొందరగానో, ఆలశ్యంగానో మొత్తంమీద వచ్చి తీరుతుంది.

సామ్రాజ్యవాదులు తమ అస్తిత్వాన్ని కాపాడుకొనడానికి వలస, అర్ధ వలస దేశాలనూ, వాటి ప్రజలనూ అణిచి పెట్టడానికి ప్రయత్నించడమేగాక, యుద్ధంపైన గూడా పెద్ద ఆశలను పెట్టుకొంటారు. సామ్రాజ్యవాదుల్లోని తీవ్రవాదులు మూడవ ప్రపంచ యుద్ధాన్నిగనుక ప్రారంభించినట్లయితే, వారు ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ సంపూర్ణ పతనం ఇంకా త్వరగా జరిగేట్టు చేయడానికి మాత్రమే తోడ్పడుతారు.

అమెరికా యొక్క బాధ్యతారహితమయిన దురాక్రమణ విధానం, మధ్యప్రాచ్యంలో ప్రమాదాన్ని కల్పించడమే గాక నూతన ప్రపంచ యుద్ధ ప్రమాదాన్నికూడా తెచ్చి పెడుతున్నదని మావ్ సే-టుంగ్ అన్నారు. శాంతి ప్రియులు, స్వాతంత్ర్యప్రియులు అయిన ప్రజలందరూ అమెరికన్, టర్కిష్ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా సిరియా పక్షాన నిలబడ్డారు. దురాక్రమణ ప్లానులను సత్వరం విసర్జించమని కోరుతూ సోవియట్ ప్రభుత్వం అమెరికాను, టర్కీని తీవ్రంగా హెచ్చరించింది. చైనా ప్రభుత్వమూ, ప్రజలూ సిరియా స్వాతంత్ర్య పోరాటాన్నీ, సోవియట్ దేశం అవలంబించిన న్యాయమైన విధానాన్నీ బల పరుస్తున్నారు.

మావ్ సే-టుంగ్ ఇంకా ఇలా ఉపన్యసించారు : "చైనా ప్రజా రిపబ్లిక్ దాని అభివృద్ధియొక్క ప్రాథమిక దశలోనే సోవియట్ దేశంతో మైత్రి, పరస్పర సహకార ఒడంబడికను చేసుకొన్నది. అది రెండు సోషలిస్టు మహాదేశాల మహత్తర ఒడంబడిక. మేము సోవియట్ యూనియన్‌తోను, యావత్తు సోషలిస్టు శిబిరంతోను ఏక గమ్యాన్నీ, ఏక జీవనాన్ని కలిగి ఉంటున్నాము. సోవియట్ దేశ నాయకత్వంతో ముందుకు పోతున్న సోషలిస్టు దేశాల ఐక్యతను కాపాడడం సోషలిస్టు దేశాలన్నిటి పవిత్ర అంతర్జాతీయ బాధ్యతగా మేము పరిగణిస్తున్నాము. అమెరికా దేశపు నాయకత్వంలో సామ్రాజ్యవాదులు, అన్ని విధాలైన కవ్వింపు చర్యలు, విద్రోహ చర్యలద్వారా సోవియట్ దేశ నాయకత్వంలో వున్న సోషలిస్టు దేశాల మైత్రిని, ఐకమత్యాన్ని బలహీనపర్చడానికి ప్రయత్నిస్తున్నారు. కాని వారు తమ ప్రయత్నాల్లో నిరాశను పొందారు. సోవియట్ దేశం నాయకత్వంలో ముందుకుపోతున్న సోషలిస్టు శిబిర ఐక్యత యింకా పెంపొందుతూనే వున్నది. ఈ దేశాల మధ్య సంబంధాలు ఐక్యత, అంతర్జాతీయత, దేశభక్తి సూత్రాలపై ఆధారపడి వున్నాయి. సమిష్టి ప్రయోజనాలు, ఏక భావాలద్వారా మనము సన్నిహితులమై యున్నాము.

## వ్లాడిస్లావ్ గోముల్కా ఉపన్యాసం

పోలిష్ ఐక్య కార్మిక పార్టీ కేంద్రకమిటీ ప్రథాన కార్యదర్శి వ్లాడిస్లావ్ గోముల్కా, సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ ఉత్సవ సమావేశంలో నేడు మాట్లాడుతూ, నలభై సంవత్సరాలలోపల సోవియట్ దేశంలో సాధింపబడిన విజయాలు మొత్తం అంతర్జాతీయ కార్మికవర్గ లాభాలుగా, యావత్తు అభ్యుదయకర మానవాళి లాభాలుగా పరిగణింపబడాలని అన్నారు.

రష్యన్ భాషలో మాట్లాడిన గోముల్కా, పోలెండు అక్టోబరు విప్లవానికి ఎంతో రుణపడి వున్నదన్నారు. పోలిష్ ప్రజలూ, సోవియట్ ప్రజలూ సమిష్టి పోరాటపు మహత్తర సంప్రదాయాలద్వారా ఏకమయ్యారని ఆయన వెల్లడించారు. సోషలిజం వైపు మేము నడుస్తున్న మార్గం, లెనిన్ మహాశయుని భావాలచే కాంతివంతమైనదన్నారాయన.

ప్రజా పోలెండు సాధించిన విజయాలకు సోవియట్ సహాయమే చాలావరకు కారణమనీ, ఉభయదేశాల మధ్య మైత్రిని పటిష్ఠం చేసుకోడానికి ముమ్ముందుకూడా ప్రయత్నిస్తామనీ కూడా ఆయన అన్నారు.

## జానోస్ కాదర్ ఉపన్యాసం

హంగేరియన్ ప్రజా రిపబ్లిక్ ప్రతినిధివర్గ నాయకుడు జానోస్ కాదర్ మాట్లాడుతూ, అక్టోబరు విప్లవంయొక్క అంతర్జాతీయ ప్రాముఖ్యతను గురించి ఉద్ఘాటించారు.

1956 ఆకురాలు కాలంలో మాకు యివ్వబడిన సహాయం వృధా కాలేదని హంగేరియన్ ప్రజల ప్రతినిధులుగా మేము తెలియజేస్తున్నామన్నారాయన. హంగేరియన్ ప్రజా రిపబ్లిక్ ఇప్పుడు సుస్థిరంగా వున్నది. హంగేరియన్ ప్రజలు తమ సోషలిస్టు కార్మిక పార్టీ నాయకత్వంలో, అంతర్జాతీయ భావాలతో ఉత్సాహితులై, హంగేరీలో సోషలిజంను నిర్మిస్తున్నారు. హంగేరియన్ ప్రజలు సోషలిజంపట్ల గొప్ప విశ్వాసాన్ని కలిగి వుంటున్నారని కాదర్ ప్రకటించారు.

## ప్రపంచంలో సకల దేశాల సమస్త శ్రామిక ప్రజలకూ, రాజకీయ, ప్రజా నాయకులకూ, వైజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలోని కార్యకర్తలకూ, పార్లమెంటులకూ, ప్రభుత్వాలకూ విజ్ఞప్తి

సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ తన ఉత్సవ సమావేశంలో నవంబరు 6వ తేదీన, సమస్త శ్రామిక ప్రజలకూ, రాజకీయ, ప్రజా నాయకులకూ, వైజ్ఞానిక, సాంస్కృతిక రంగాలలోని కార్యకర్తలకూ, ప్రపంచంలోని అన్ని దేశాల పార్లమెంటులూ, ప్రభుత్వాలకూ ఒక విజ్ఞప్తిని ఏకగ్రీవంగా ఆమోదించింది.

సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ సమస్త ప్రజలనూ సంబోధిస్తూ, నిర్విరామంగా శాంతిని బలపరుస్తూ వుండమనీ, వివిధ ప్రజల మధ్య మైత్రి, సహకారాలను పటిష్ఠం చేయడానికి శక్తివంచన లేకుండా పాటుపడమనీ విజ్ఞప్తి చేసింది.

విభిన్న సాంఘిక వ్యవస్థలు గల దేశాల శాంతియుత సహజీవనం, అంతర్జాతీయ సహకారాలకొరకూ, ఆయుధాలు, సాయుధ బలాల సాధారణ తగ్గింపుకూ, అణు, ఉదజని ఆయుధాల నిషేధాన్ని సాధించడానికీ, అణు ఉదజని ఆయుధ పాటవ పరీక్షల సత్వర నిషేధానికీ, యూరపు, ఆసియాలలో సమిష్టి భద్రతా వ్యవస్థ స్థాపనకూ ఒడంబడికను సాధించడానికీ, వివిధ ప్రజల మధ్య విశ్వాసాన్ని పెంపొందజేయడానికీ నిరంతరం పోరాటం కొనసాగించమని యీ విజ్ఞప్తి కోరింది.

సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్, శాంతికొరకు చురుకుగా పాటుపడమని సమస్త శాంతిప్రియ ప్రజలకు విజ్ఞప్తి చేసింది.

"శాంతి పరిరక్షణ సమస్య ప్రజల చేతుల్లోనే వున్నది," అని సుప్రీమ్ సోవియట్ తన విజ్ఞప్తిలో ప్రకటించింది. "సమస్త దేశాల ప్రజల్లారా, ప్రపంచ శాంతికొరకు జరిగే పోరాటంలో మీరు జరిపే కృషిని సంఘటిత పరచండి!"

అక్టోబరు విప్లవం నలభైయవ వార్షికోత్సవ సందర్భంలో జరిగిన సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ ఉత్సవ సమావేశం యీ విజ్ఞప్తిని ఆమోదించడంతో ముగిసింది.



సంపుటి 8,
సంచిక 22.

నవంబర్ 28,
1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచార శాఖచే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



# నలభై ఏళ్ళ సోవియట్ రాజ్యం

హెచ్. వత్స్

ఈ సంవత్సరం నవంబరు 7 వ తేదీని అక్టోబరు విప్లవ నలభైయవ వార్షికోత్సవం ప్రపంచం అంతటా జరిగింది. కార్మిక కర్షకులు, బుద్ధిజీవులు దానిని మానవజాతి చరిత్రలో ఒక నూతనాధ్యాయంగా కీర్తించారు.

పలు ప్రభుత్వ ప్రతినిధివర్గాలూ, వివిధదేశాల శ్రామికవర్గ నాయకులూ మాస్కో ఉత్సవాలలో పాల్గొన్నారు. వారిలో కొందరు మావో సె-తుంగ్, గోముల్కా, ఉల్‌బ్రిచ్, హో ఛి మిన్.

భారత రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్, భారత ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ తరఫున భారత దేశంనుంచి సోవియట్ ప్రభుత్వానికి, ప్రజలకు అభినందనలు అందజేయబడ్డాయి. ఈ సందర్భాన దేశంలో చాలా సభలు జరిగాయి, యీ సభలలో యీ ఉత్సవ ప్రాముఖ్యం వివరింప బడింది.

సోవియట్ దేశ సుప్రీం సోవియట్ యిటీవలి ఉత్సవ సమావేశంలో చేసిన అత్యంత ప్రధానమైన ఉపన్యాసంలో యన్. యస్. కృశ్చేవ్, అన్ని రంగాలలో—పారిశ్రామిక, వ్యావసాయక, సాంఘిక, విద్యా, వైజ్ఞానికాది రంగాలలో—సాధింపబడిన బ్రహ్మాండమైన పురోగమనాన్ని ఉద్ఘాటిస్తూ, సోవియట్ దేశం గడిచిన మహోజ్జ్వల పథం గురించి వివరించారు (యన్. యస్. కృశ్చేవ్ ఉపన్యాస సంక్షిప్త పాఠం, యీ సంచిక అనుబంధంలో వెలువడుతోంది).

ఈ నలభై ఎళ్ళలో, సోవియట్ దేశం క్షీణ వ్యవస్థ దశనుండి ప్రపంచంలోని అగ్రగణ్యమైన సామ్యవాద దేశంగా పరివర్తనాన్ని పొంది, బ్రహ్మాండమైన పురోగతిని సాధించింది. స్పూత్నిక్‌ల నీడల క్రింద పశ్చిమ ప్రపంచం, నేడు సోవియట్ దేశానికి గల బ్రహ్మాండమైన నూతన శక్తినుంచి ఆవిర్భవించి, భూమికి ఉపగ్రహాలను పంపడంద్వారా స్పష్టపడిన సోవియట్ విదేశాంగ విధానం అవలంభించే కొత్త ధోరణుల గురించి ఊహాగానాలు చేస్తోంది. సోవియట్ విధానంలో మార్పులు వస్తాయని జోస్యంచెప్పే వ్యాఖ్యాతలకు కొరత ఏమీలేదు. ఈ నూతన శక్తివల్ల యివి "బలాధిక్యతా" విధానాన్ని అవలంబిస్తాయని వారి అభిప్రాయం. కృశ్చేవ్ ఉపన్యాసం యిటువంటి ఊహాగానాలన్నిటినీ అంతంచేసి, అనుమానాలన్నిటినీ తొలగించింది. ఇంకోసారి సోవియట్ దేశం సవాలు చేస్తోంది—అమితాయుధోత్పత్తి పోటీకొరకు కాదు, చిన్నారి చందమామల పోటీ కొరకు, పరమాణు శక్తి శాంతియుత వినియోగాల కొరకు, శిఖరాగ్ర సంభాషణల కొరకు, నిజమైన శాశ్వత నిరాయుధీకరణ కొరకు.

నలభై ఏళ్ళలో మొత్తం పారిశ్రామిక ఉత్పత్తి 1913 తో పోల్చితే, సోవియట్ దేశంలో 33 రెట్లు హెచ్చింది. వాస్తవానికి యీ బ్రహ్మాండమైన పారిశ్రామికోత్పత్తి 20 నుంచి 22 ఏళ్ళలో సాధింపబడింది. తమ పారిశ్రామికోత్పత్తిని సుమారు 30 రెట్లకు పెంచుకోవడానికి అమెరికా, బ్రిటన్, జర్మనీ దేశాలకు 80 నుండి 150 సంవత్సరాలు పట్టింది.

సామ్రాజ్యవాదుల యుద్ధ కృత్యాలు ఆర్థికాభివృద్ధినీ, ప్రజల జీవన ప్రమాణాల అభివృద్ధినీ ఆటంకపర్చకపోయి వున్నట్టయితే, సోవియట్ దేశం యింకా ఎంతగా అభివృద్ధి చెంది వుండేదో ఊహించవచ్చును. నాజీ జర్మనీ దండయాత్ర కాలంలో దేశం ఎంతో నష్టాన్ని, 256900 కోట్ల రూబుళ్ళు ఖరీదుచేసే వాటినష్టాన్ని పొందింది.

లేదా వ్యవసాయాన్ని తీసుకొండి. ప్రపంచంలోకల్లా భారీ ఎత్తు వ్యవసాయంగల దేశం, నేడు సోవియట్ దేశం.

సామ్యవాద విజయం నిరుద్యోగాన్ని శాశ్వతంగా తుదముట్టించింది. సాంఘిక భీమా, పెన్షన్లు, విద్యార్థి వేతనాలు, ఉచిత విద్య, వైద్య సహాయాలకు అపారమైన మొత్తాలు కేటాయింపబడుతున్నాయి.

సోవియట్ దేశం, యితర దేశాలతో శాంతియుతంగా సహజీవనాన్ని సాగిస్తూ తన లక్ష్యాలను సాధించదలుచుకుంది. సోవియట్ ప్రజలకు యుద్ధం అసహ్యకరమైనది, హేయమైనది. మొదట తమపైని దాడి జరిగితేనే తప్ప ఎన్నడూ యుద్ధానికి తలపడమని, శాంతియుతమైన పోటీకి వారు సవాలు చేస్తున్నారు. సమృద్ధివంతమైన శాంతియుత జీవనావకాశాలు మానవాళి ఎదుట నున్నాయి। ఇక కత్తి ఝళిపింపులు ఆగాలి. తమ యిళ్ళు వాకళ్ళు నాశనమవుతాయన్న భయం లేకుండా జీవించడానికి యీ భూలోకాన్ని సంతోషకరమైన దానిగా, ఆనందప్రదమైనదానిగా చేసుకోవాలన్న యుగయుగాలనాటి ప్రజల స్వప్న సాఫల్యానికి జనులు శాంతి సామరస్యాలతో కృషి చేయాలి.

నలభై ఏళ్ళ సోవియట్ రాజ్యం, నేడు మానవకోటికి అందుబాటులో వున్న యిటువంటి అవకాశాలను సూచిస్తూ వుంది.

# యు. లోవేంకో
కాండిడేట్ అఫ్ హిస్టారికల్ సైన్సెస్

నవంబరు మూడవ తేదిన సోవియట్ దేశం భూమి యొక్క రెండవ కృత్రిమపు ఉపగ్రహాన్ని యెగురవేసింది.

రెండవ కృత్రిమ ఉపగ్రంలో యీ దిగువ నుదహరించినవి ఉన్నాయి: వాతావరణం పైపొరలను, అంతరిక్షంలో ప్రాణి మనుగడకు గల పరిస్థితులను పరిశీలించడానికి యంత్రపరికరాలు, పరిశోధనార్థం ఒక జంతువు (కుక్క), పరిగ్రహించిన వైజ్ఞానిక సమాచారాన్ని భూమిమీదికి ప్రసారం చేయడ నికి యంత్రాలు.

పైన ఉదహరించిన యంత్ర పరికరాలు, పరిశోధనార్థం ఉంచబడిన జంతువు, శక్తి మూలాధారాల మొత్తం బరువు 508.3 కిలోగ్రాములు.

కృత్రిమ ఉపగ్రహానికి సెకెండుకు 8.000 మీటర్ల కక్ష్యవేగం కల్పింపబడినట్లు పరిశీలనలవల్ల తెలుస్తున్నది.

కట్టిన లెక్కల ప్రకారం, భూతలంనుండి కృత్రిమ ఉపగ్రహం ఉన్న అత్యున్నతస్థాయి 1,500 కిలోమీటర్లకు మించి ఉన్నది; భూమిచుట్టూ ఒకసారి పూర్తిగా తిరిగిరావడానికి పట్టేకాలం ఒకగంట నలభైరెండు నిముషాలు; ఉపగ్రహం భూమధ్య రేఖాతలానికి 65 డిగ్రీల ఏటవాలుకక్ష్యలో పరిభ్రమిస్తున్నది.

రెండవ సోవియట్ కృత్రిమ ఉపగ్రహాన్ని నిర్మించిన పరిశోధనాసంస్థలు, డిజైనింగు బ్యూరోలు వుద్యోగులు, టెస్టర్లు, పరిశ్రమల కార్మికులు, ఆ కృత్రిమ వుపగ్రహపు యెగురవేతను అక్టోబరు మహావిప్లవం నలభైయవ వార్షికోత్సవానికి అంకితం చేశారు.

మహాపర్వదినమైన అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం నలభైయవ వార్షికోత్సవానికి ముందు, భూమి యొక్క రెండవ కృత్రిమ ఉపగ్రహం మనగోళం చుట్టూ తన రోదసీ పథాన్ని అనుగమించింది.

రెండవ కృత్రిమ ఉపగ్రహం యెగురవేయబడిన తర్వాత, మానవాళి తన అభివృద్ధియందు, 1957 ఆకురాలు కాలంలో, ఒక నూతన శకంలో అడుగు పెట్టిందన్న విషయం స్పష్టంగా తేలిపోయింది.

వార్తాపత్రికల్లోనూ, మ్యాగజైన్లలోను భూమియొక్క కృత్రిమ ఉపగ్రహానికి ఇవ్వబడుతున్న స్థానాన్నిబట్టి, పాశ్చాత్య పెట్టుబడిదారి దేశాల ప్రచారకులు, రాజకీయవేత్తలు, విజ్ఞానశాస్త్రవేత్తలు, ప్రపంచంలో మరేదేశమూ కాక, రష్యన్లే, సోవియట్ దేశమే మానవుని కలకాలపు కలలను నిజాలుగా యెందువల్ల చేయగలిగారు?" అన్న సమస్యతో ప్రధానంగా సతమతమై పోతున్నట్లు తెలుస్తుంది.

ఈ ప్రశ్నకు సమాధాన మివ్వడం యేమంత కష్టమైన పని కాదు. అనేకమంది పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రవేత్తలు కొద్దో, గొప్పో సరిగ్గానే దానికి సమాధానమిచ్చారు. సైబర్నెటిక్స్, ఎలక్ట్రానిక్స్‌లో ప్రవీణుడైన ఫ్రెంచి విజ్ఞానశాస్త్రవేత్త ఆల్బర్ట్ డ్యూక్రోకి "ఎక్స్ ప్రెసీ" అనే ఒక వారపత్రికలో ఇలా వ్రాశారు: "సోవియట్ దేశం విజ్ఞానశాస్త్రంలోను, ఇంజినీరింగులోను సాధించిన మహత్తర విజయాల యొక్క, విజ్ఞానశాస్త్రపు కొన్ని ఆధునిక శాఖల్లో, అందులోను ప్రధానంగా విద్యుత్ లోహశాస్త్రం, సైబర్నెటిక్స్, ఎలక్ట్రానిక్స్, రసాయనిక శాస్త్రం, విద్యుత్ రసాయనిక శాస్త్రాలలోనూ, పింగాణీ పరిశ్రమలోనూ సోవియట్ దేశం సాధించిన అత్యున్నత స్థాయి యొక్క సహజఫలితమే కృత్రిమ ఉపగ్రహం. ఈ విజయాలన్నీ విజ్ఞానశాస్త్రరంగంలోను, ఇంజినీరింగు రంగంలోను క్రమమైన ప్లానింగువల్లనే యీ విజయాలు సాధ్యమయ్యాయి."

"కృత్రిమ ఉపగ్రహాన్ని ఎగురవేయడంలో సోవియట్‌యూనియన్ మొట్టమొదటి దేశం కావడం యాదృచ్ఛికంగా జరిగిన విషయమేమీకాదు," అంటూ మరొక ఫ్రెంచి విజ్ఞానశాస్త్రవేత్త ఎఫ్. జూలియట్-క్యూరీ వ్రాశారు. "సోషలిస్టు దేశాలలో విజ్ఞానశాస్త్రం, ఇంజినీరింగులు అభివృద్ధి పొందుతున్న మార్గాలేవేరు."

అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సుల పాలకవర్గాల యొక్క ప్రచారకులు, వ్యాఖ్యాతలు, ప్రముఖ నాయకులు సోవియట్ స్పుత్నిక్ ఎగురవేయబడడాన్ని గురించి ప్రస్తావిస్తూ, "పాశ్చాత్య ప్రపంచంలో దుస్థితి యేర్పడింద"న్నట్టుగానే మాట్లాడుతున్నారు.

యుద్ధానంతర దశలో పాశ్చాత్య దేశాలు, సోవియట్ దేశంతోసహా ఇతర దేశాలన్నిటికంటే తాము సాంకేతిక, సైనిక-ఆర్థిక ఔన్నత్యాన్ని కలిగి వున్నామన్న సిద్ధాంతంపై తమ విధానాన్ని రూపొందించుకొన్నాయి. "బలాధిక్యతాస్థాన" విధానం ముమ్మరంగా అవలంబింపబడ్డది. సాయుధ ఘర్షణ జరిగినట్లయితే, గత యుద్ధంలోవలెనే అమెరికన్ భూభాగం, ఆధునిక యుద్ధసాధనాలకు అందుబాటులో ఉండదన్న ఉద్దేశ్యంతో ఆ విధానం అవలంబింపబడుతున్నది.

బలాధిక్యత స్థానాల విధానంతోపాటు విపరీతమైన దుష్ప్రచారం గూడా ప్రారంభింపబడింది. పాశ్చాత్యరాజ్యాల ఆర్థిక, సాంకేతిక బలంతో, ముఖ్యంగా అమెరికా యొక్క బలంతో ప్రజానీకాన్ని భయపెట్టడమే యీ ప్రచారం యొక్క ప్రధానోద్దేశం. సోవియట్ దేశం కంటే, అమెరికా "అధిక్యతను" కలిగివున్నదన్న అసత్య సిద్ధాంత ప్రచారాన్ని తీవ్రతరం చేయడమే ఈ ప్రచారం యొక్క ముఖ్యాంశము. వలసపెత్తందారీ ఆధిపత్యంనుండి ఈ మధ్యనే విముక్తి పొందిన బడుగు దేశాలను ఖండాంతరాలలో నున్న గుత్తవ్యాపారుల కౌగిట్లోకి త్రోయడమే దానియొక్క ఉద్దేశ్యం. అందువల్లనే, మూడు లేదా నాలుగు సంవత్సరాల క్రితం ఆర్థికంగా వెనుకబడిన దేశాలకు యేలాంటి ప్రయోజనాపేక్ష లేకుండా సాంకేతిక సహాయం చేయడానికి తన సంసిద్ధతను సోవియట్ దేశం తెలియజేసినప్పుడు పాశ్చాత్య అభివృద్ధి నిరోధక పత్రికలు ఒక్కసారిగా విరుచుకుపడ్డాయి. సోవియట్ దేశం తానే "సాంకేతికంగా వెనుకబడి"ఉన్నది గాబట్టి ఇతర దేశాలకు సహాయం చేస్తానన్న తన

ప్రతిపాదనలను అమలుపర్చజాలదని నిరూపించదానికి పాశ్చాత్య ప్రచారకులు ప్రయత్నించారు.

బలాధిక్యతాస్థానపు విధానంతోపాటు జరుపబడిన ప్రచారం ఫలించింది; వాస్తవవిషయాలు తెలియని సామాన్య ప్రజలనేకులు అపోహలకు లోనయ్యారు. ఈ సంవత్సరం ఆగస్టుమాసంలో సోవియట్ దేశంలో, భూగోళం యేప్రాంతానికైనా ఆయుధాలను తీసుకొనిపోగల ఖండాంతరగామి బాలిస్టిక్ రాకెట్ విజయవంతంగా యెగురవేయబడిన వార్త విన్నప్పుడు అమెరికాలో కలిగినసంచలనమే కొంతవరకు విషయాలను వ్యక్తం చేస్తుంది. ఈ వర్గాలు "టాస్" ప్రకటనను "ప్రచారం"గా లెక్కకట్టి, అసలు అలాంటి ప్రయోగమే జరిగిందా అని శంకింపసాగాయి.

ఆపైన, ఐదు వారాల తర్వాత సోవియట్ దేశపు మొట్టమొదటి కృత్రిమపు ఉపగ్రహం దాని కక్ష్యలోకి ఎగురవేయబడింది. "ప్రచ్ఛన్నయుద్ధ" వ్యూహకారులు తాము కాదనడానికి వీలులేని వాస్తవ విషయాన్ని యెదుర్కొన్నారు. దాని అర్థమేమిటో అందరికీ సువ్యక్తమే. అంతటి యెత్తుకు ఉపగ్రహం యెగురవేయబడడానికి వాహక రాకెట్, అనగా కచ్చితంగా నిర్ణీతస్థానానికి పంపబడగల ఖండాంతరగామి బాలిస్టిక్ రాకెట్ అవసరం. అలాంటప్పటికిగూడా స్పుత్నిక్‌ను "లోహపు వస్తువు" క్రింద తేలికగా లెక్కగట్టే హ్రస్వదృష్టిగల రాజకీయవేత్తలు అమెరికాలో ఇంకా ఉన్నప్పటికీ, "ప్రచ్ఛన్నయుద్ధ" ప్రోత్సాహకులు మొట్టమొదటి ఉపగ్రహంనుండి రావడం మొదలుపెట్టిన సంజ్ఞలను విని చల్లబడ్డారు.

"బిజినెస్ వీక్" అనే ఒక పత్రిక ఇలా వ్రాసింది: "అంతరిక్షంలోకి స్పుత్నిక్ యెగురవేత సోవియట్ ఇంజినీరింగ్, సైనిక శక్తిని గురించి ప్రపంచం వేసుకొన్న అంచనా అంతా తారుమారయ్యింది. ప్రాశ్చాత్య ప్రపంచమంతటా అమెరికా యొక్క పరపతి బాగా దెబ్బతిన్నది." (రష్యన్ భాషనుండి తిరిగి అనువదింపబడింది)

"సోవియట్ దేశంకంటే తాము సాంకేతికాధిక్యతను" కలిగి ఉన్నామన్న ధోరణిలో తమ విధానాన్ని రూపొందించుకొన్న వాషింగ్టన్ అధికారులు "బాధాకరమైన ఆశాభంగాన్ని" పొందుతున్నారని అమెరికన్ వార్తాపత్రికలనిండా వార్తలు కనపబడుతున్నాయి. ఇలాంటి విషయాల పట్టిక ఇంకా యెంతయినా ఇవ్వవచ్చును.

కాబట్టి, భూమియొక్క మొట్టమొదటి కృత్రిమ ఉపగ్రహం యెగురువేతవల్ల కలిగిన ప్రధానఫలితం యేమిటంటే, అమెరికా అంతటా సోవియట్ దేశ సాంకేతికాభివృద్ధిని గురించీ. దాని రక్షణాశక్తిని గురించీ సరియైన భావాన్ని కల్పించడం. ఇదంతా, బలాధిక్యతాస్థాన విధానాన్ని ప్రచారంచేసే దుష్టసాహసికులను తప్పకుండా నెమ్మది పర్చి తీరుతుంది.

భూమండలంలో, అన్ని దేశాలలోవున్న సుహృద్భావపూరిత ప్రజలందరూ, బలాధిక్యతాస్థాన విధానాన్ని అవలంభించే దేశాలకంటే సోవియట్ దేశం బాగా ముందంజ వేసినందుకు సంతృప్తిని ప్రకటించారు. ఈ విషయం ప్రపంచ శాంతిపైన గట్టి ప్రభావాన్ని కలుగజేయక మానదు.

సోవియట్ దేశం సాధించిన మహత్తర వైజ్ఞానిక సాంకేతిక విజయం శాంతి విషయంలో ప్రపంచ శక్తుల అన్యోన్య సంబంధాలను మార్చివేసింది.

సోవియట్ దేశం యెల్లప్పుడూ, నలభై సంవత్సరాల దాని అస్తిత్వంతో, శాంతియుత సహజీవన విధానాన్ని అవలంబిస్తూ వచ్చింది, ఇప్పుడు అవలంబిస్తున్నది. నిరాయుధీకరణకొరకు, అణు, ఉదజని ఆయుధాల నిషేధం కొరకూ. ప్రపంచమంతటా శాంతికొరకు నిర్విరామంగా పాటుపడుతున్నది.

అందువల్ల శాంతిప్రియ దేశమైన, సోవియట్ యూనియన్ కృత్రిమ ఉపగ్రహాన్ని విజయవంతంగా ఎగురవేయడాన్ని ప్రపంచంలోని సామాన్య ప్రజలందరూ, శాంతి, అభ్యుదయాలు విజయవంతమవుతాయన్న గటి విశ్వాసంతో హర్షిస్తున్నారు.

మూడు దశల రాకెట్ చిత్రం




మొదటి దశ—
నిర్దేశిత రాకెట్—మొత్తం క్షిపణిని(మిసైల్‌ను)ముందుగా లెక్కకట్టబడిన యెత్తుకు ఉపగ్రహానికి అవసరమైన కక్ష్య వేగంలో 15 శాతం వేగంతో పైకి యెగురవేస్తుంది.

రెండవ దశ—
ద్రవఇంధనపు ఇంజనుగల రాకెట్—తర్వాతిస్థాయి దశను చేరుకోడానికి తోడ్పడి ఉపగ్రహానికి అవసరమైన కక్షి వేగంలో 32 శాతం వేగాన్ని కల్పిస్తుంది.

మూడవ దశ—
ఘన ఇంధనపు ఇంజనును కలిగిన రాకెట్. ఉపగ్రహాన కూచిగా ఉన్న దాని ముందు భాగంలో ఉంచబడి, అవసరమైన కక్షి వేగం చేకూరగానే విడివడిపోతుంది




మూడుదశల రాకెట్‌లో ఎగురవేత ఉపగ్రహపు ప్రక్షేపవక్రం

### సోవియట్ భారత దేశాల ఆర్థిక సంబంధాలకు మరింత పరిపుష్టి

భారత దేశంలో కొన్ని పరిశ్రమల స్థాపన గురించి, ఏభైకోట్ల రూబుళ్ళ అప్పు ఏర్పాట్ల గురించి సోవియట్ దేశ ప్రభుత్వానికీ, భారత దేశ ప్రభుత్వానికీ మధ్య ఒక ఒడంబడిక న్యూఢిల్లీలో, 1957 నవంబరు 9 వ తేదీని జరిగింది.

భారత దేశంలో ఒక భారీ యంత్ర నిర్మాణ పరిశ్రమనూ, ఒక బొగ్గుగని యంత్ర పరిశ్రమనూ, ఒక ఆప్టికల్ గ్లాస్ ఫాక్టరీనీ, ఒక థెర్మల్ పవర్ స్టేషన్‌నూ (250,000 కిలోవాట్లు), గనుల త్రవ్వకానికీ, బొగ్గును బాగుచేయడానికీ సంబంధించిన పరిశ్రమలనూ స్థాపించడానికి యీ అప్పు ఉపయోగింపబడుతుంది. సోవియట్ సంస్థ సవివరమైన ప్రాజెక్టు రిపోర్టులను తయారుచేసి, సామగ్రినీ, యంత్రాలనూ, వస్తువులనూ, సాంకేతిక నైపుణ్యాన్నీ, యీ పనులన్నిటి కొరకు సహాయాన్ని సరఫరా చేస్తుంది; సోవియట్ దేశంలో భారతీయ సిబ్బంది శిక్షణకు ఏర్పాట్లు చేస్తుంది.

నూటికి రెండున్నర సాలు వడ్డీగల యీ అప్పును, ఒకొక్క పరిశ్రమకు సంబంధించిన యంత్రాలూ, సామగ్రీ సోవియట్ దేశం నుండి అందడం ముగిశాక ఒకసంవత్సరం మొదలుకొని 12 సమానమైన సాంవత్సరిక భాగాలలో తిరిగి చెల్లించాలి.

ఈ పరిశ్రమలకు విదేశీ మారకపు అవసరాలన్నిటికీ అప్పు వర్తిస్తుంది. పైని పేర్కొనబడిన పనులకు ఇప్పుడు అంగీకరింపబడిన అప్పు, యీ పరిశ్రమల స్థాపనకు చాలకపోయినట్టయితే, మరి కొంత అప్పుకొరకుకూడా అవకాశం కల్పింపబడింది.

సోవియట్ దేశం తరపున మిస్టర్ యన్. ఏ. స్మెలోవ్, భారతదేశం తరపున, మంత్రివర్గ కార్యదర్శి శ్రీ యం. కె. వెల్లోడీ ఒడంబడికపైని చేవ్రాళ్ళు చేశారు.

ఈ ఒడంబడికవల్ల, సమీప భవిష్యత్తులో విదేశీ మారకాన్ని నిలవ చేసుకోవడానికి భారత ప్రభుత్వానికి బాగా తోడ్పాటు లభించి, ప్రస్తుత పంచవర్ష ప్రణాళిక పురోగమనం పెంపొందుతుంది. ఈ పెద్ద సంకొత్త పరిశ్రమల స్థాపన, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాల ననుసరించి స్థానికంగా భారీయంత్రాల తయారీనీ, దాని మూల పరిశ్రమల యితోధికాభివృద్ధికి అవసరమైన సామగ్రి తయారీనీ మొదటిసారిగా ఏర్పర్చడానికి భారతదేశానికి అవకాశం కలిగిస్తుంది.

స్నేహ సంబంధాలు దృఢపడడానికి యీ ఒడంబడిక ఒక ముందడుగు, యీ రెండు దేశాలమధ్య ఆర్థికరంగంలో సహకారానికి యింకొక తార్కాణం.

★

మిస్టర్ ఎన్. ఎ. స్మెలోవ్ (ఎడమ) శ్రీ ఎం. కె. వెల్లోడీ సోవియట్, భారత దేశ ప్రభుత్వాల పక్షంగా అంగీకార పత్రంపై సంతకాలు చేస్తోన్న దృశ్యం



# చిన్నారి చందమామలకు భారతీయుల జేజేలు

సోవియట్ దేశం భూమికి ఉపగ్రహాన్ని పంపడం, భారతీయ ప్రజలు అన్ని వర్గాలలోనూ అపారమైన ఆసక్తిని రేకెత్తించింది. ఈ సంఘటనను సంస్మరిస్తూ మా కార్యాలయానికి ఎన్నో సందేశాలూ, ఉత్తరాలూ, టెలిగ్రాములూ కుప్పతెప్పలుగా వస్తున్నాయి; అవి యీ అపూర్వ విజయాన్ని సాధించినందుకు సోవియట్ విజ్ఞాన శాస్త్రవేత్తలకు అభినందనలనూ, శుభాకాంక్షలనూ అందజేస్తున్నాయి.

ఈ సందేశాలను చదివితే, చాలా ఆసక్తిజనకంగా వుంటుంది. వాటిలో కొన్నిటిని యిక్కడ ప్రచురిస్తున్నాము.

"....నాకు 1957 అక్టోబరు 4వ తేదీని ఆడపిల్ల కలిగింది.... అంతరిక్షంలోనికి జయప్రదంగా మొట్టమొదట చిన్నారి చందమామను పంపిన మహత్తర దినాన్నే అమ్మాయి పుట్టినందువల్ల, నేను దానికి "స్పుత్నిక్" అని నామకరణం చేశాను .."

హెచ్. ఎ. సుబ్రావు
తూత్తుకుడి.

"ఇప్పటివరకూ మానవుణ్ని భూమికి కట్టి పడవేసిన శక్తుల నుండి మానవ విమోచనానికి నూతన చిహ్నమైన దీనిని పైకి పంపిన మీ మహాదేశపు విజ్ఞాన శాస్త్రజ్ఞులకూ, సాంకేతిక నిపుణులకూ దయ చేసి నా అభినందనలు అందజేయండి. ఉపగ్రహంద్వారా జరిగిన యీ కొత్త ప్రయోగం, మానవ ప్రపంచంలో శాంతి సామరస్యాలను కాపాడడానికి ప్రయోజనకారి అగునుగాక!"

హరిరాం సథానీ,
పార్లమెంటు మాజీ సభ్యుడు,
భివ్వారా.

"కొద్దిరోజుల క్రితం, రాకెట్లలో, లేదా అంతరిక్షంలోనికి కృత్రిమ చంద్రునిలో కొన్ని జంతువులను పంపడం గురించి పత్రికలలో చదివాను ...జంతువులకు బదులుగా మనిషిని ఎందుకు పంపకూడదు ...యిందుకు అంగీకరించిన వారిని. జంతువులకంటె మనుష్యులు ఎక్కువ ఉపయోగకరంగా వుంటారనుకుంటాను.... ఇది సాధ్యమైతే నా సేవలను అర్పిస్తాను. నేను సుమారు పాతికేళ్ళ యువకుణ్ని, మంచి ఆరోగ్యవంతుణ్ని, వైమానికునిగా విమాన దళంలో పని చేశానుకూడా...."

బల్బీర్ సింగ్,
లూధియానా.

"భూమికి ఉపగ్రహాన్ని పంపడంలో విజయం సాధించినందుకు నా హృదయపూర్వకమైన అభినందనలను అర్పించవలచుకున్నాను. ఇది ప్రపంచం అంతట్నీ ఆశ్చర్యపరిచింది. ఇంకో ఆశాజనకమైన విషయం, యీ ఉపగ్రహం వెనుక సైనిక లక్ష్యాలేవీ లేకపోవడం. విజ్ఞానశాస్త్ర ప్రయోజనంకోసం దానిని శాంతియుత కార్యాలకు ఉపయోగించమని మీకు నా విజ్ఞప్తి... "

జినత్ సియాల్ కోటి,
కాన్‌పూర్.



# అంతర్జాతీయ విద్యార్థి దినోత్సవం

< ఒ. బొర్దద్యాన్ >

నవంబరు 17, అంతర్జాతీయ విద్యార్థి దినం. ఈ దినం చరిత్ర 1939 ఆకురాలుకాలంలో జరిగిన విషాదాంత ఘటనలతో మొదలయ్యింది. జర్మన్ ఆక్రమణలో వున్న ఛార్లెస్ విశ్వవిద్యాలయ విద్యార్థులు నవంబరు 17న, వైద్యవిద్యార్థి జాన్ఒప్లెతలా ఘోరంగా హత్యచేయబడినందుకు అసమ్మతిగా ఒక ప్రదర్శనను చేశారు. ప్రాగ్ విద్యార్థులను హిట్లరైట్లు క్రూరంగా శిక్షించారు. ప్రదర్శన నాయకులను వారు నిర్బంధించి, కాల్చిచంపివేశారు. అర్ధరాత్రిని గెస్టపోదళాలు విద్యార్థుల వసతిగృహాలపైని దాడిచేశాయి. రెండువేలమందికి పైగా విద్యార్థులను క్రూరంగా కొట్టి, ఒరనీన్‌బర్గ్ మృత్యు శిబిరానికి పంపారు. ఫాసిస్టు రాక్షసత్వానికి వ్యతిరేకంగా విద్యార్థులను బలపర్చిన విశ్వవిద్యాలయాచార్యులు చాలామంది ఖైదుచేయబడ్డారు.

ఈ హత్యాకాండ వార్తలు ప్రపంచమంతటా వ్యాపించాయి. అప్పట్నుండీ, నవంబరు 17 అభివృద్ధి నిరోధకత్వానికీ, యుద్ధానికీ వ్యతిరేకంగా విద్యార్థుల పోరాటదినం అయ్యింది. రెండేళ్ళతరవాత, యీ రోజు అంతర్జాతీయ విద్యార్థిదినంగా ప్రపంచంలోని అనేక దేశాలలో, అమెరికాలో, బ్రిటన్లో, సోవియట్ దేశం మొదలైన వాట్లోనూ, ఢిల్లీనుండి ఎడిన్‌బర్గ్ వరకూ చాలా నగరాలలోనూ మొదట జరుపబడింది.

కఠిన యుద్ధంలో సాధింపబడి ప్రపంచంలో శాంతి ఉదయించినపుడు, ప్రజాస్వామిక విద్యార్థి ప్రతినిధులు ప్రాగ్‌లో తమ ప్రథమ యుద్ధానంతర మహాసభలో సమావేశమై, ప్రపంచ విద్యార్థులను సమీకరించి, వారిహక్కులనూ, ప్రయోజనాలనూ పెంపొందించే సంస్థను స్థాపించడానికి నిర్ణయించుకున్నారు.

మహాసభ ప్రతినిధులు ప్రజాస్వామిక సాంప్రదాయాలను వర్ధిల్లజేయమనీ, యువజనులలో యితర దేశాల సంస్కృతిపట్ల గౌరవం కలిగించమనీ, జాతి ఆధిక్యతకు సంబంధించిన కుహనా వైజ్ఞానిక సూత్రాలను ఎదుర్కొనమనీ, ప్రజాస్వామ్య, ప్రగతి భావనలో వైజ్ఞానికాభివృద్ధికి కృషిచేయమనీ, ప్రపంచ విద్యార్థులకు విజ్ఞప్తి చేశారు.

ప్రారంభంనుండీ సోవియట్ విద్యార్థులు చురుకుగా అంతర్జాతీయ విద్యార్థి సంఘంలో పనిచేస్తున్నారు. ఏడాదికేడాది ఎక్కువగా విద్యార్థి ప్రతినిధి వర్గాలు విదేశాలకు వెళ్తున్నాయి, విదేశీ ప్రతినిధులు సోవియట్ దేశానికి వస్తున్నారు. వివిధ దేశాలకు చెందిన ఎనిమిదివేల మంది విద్యార్థులు, మాస్కో విద్యార్థులకు అతిథులుగా మాస్కో ఉత్సవానికి వచ్చారు.

అంతర్జాతీయ విద్యార్థిసభలూ, సమావేశాలూ విద్యార్థి సహకారానికి ప్రముఖమైన మైలురాళ్లు. అలిఘర్ విద్యార్థులు, అంతర్జాతీయ విద్యార్థి సంఘంవారూ, అంతర్జాతీయ భౌగోళికశాస్త్ర సభను జరిపారు, యిది అలిఘర్లో గొప్పగా జరిగింది. ఒక్క భారత దేశమే నలభై విశ్వవిద్యాలయాల, భౌగోళికసంస్థల ప్రతినిధులను పంపించింది. వీరు ప్రతినిధులకు ఎన్నో ఆసక్తిజనకమైన విషయాలను చెప్పారు. ఆసియా, ఆఫ్రికాల భౌగోళిక పరిశీలనా సంఘస్థాపన, యీ సమావేశం ఫలితాలలో ఒకటి.

ప్రపంచ విద్యార్థులు మానవుని సుఖతర భవిష్యత్తుకొరకు పోరాటంలో వినియోగించేందుకు, తమ శక్తిని సమీకరించుకుంటున్నారు. పశ్చిమ బెంగాల్ విద్యార్థి కౌశిక్‌ప్రసాద్ భట్టాచార్య దీనిని చక్కగా వ్యక్తంచేశాడు :

"సహకారంకొరకు, ఒకరి ఆదర్శాల నొకరు, ఒకరి జ్ఞానాన్ని ఒకరు తెలుసుకునేందుకు కృషిచేస్తూ మానవుడు సుఖతరజీవన నిర్మాణానికీ, శాంతి అనబడే ప్రగతి రక్షణకూ తన యావచ్ఛక్తినీ ధారపోస్తాడు. ప్రగతి అంటే ప్రకృతిపై మానవుని బలాధిక్యత అన్నమాట. అందువల్ల శాంతి అంటే, ప్రకృతిపై పోరాటంలో, జీవిత ప్రగతికొరకు మానవశక్తి శాంతియుత వినియోగమన్నమాట."

# మాస్కోలోని విదేశ విద్యార్థులు

## ఎ. గోర్కిన్

*ఉత్తమోత్తములైన ఉపాధ్యాయుల ఉపన్యాసాలకు హాజరు కావడానికీ, అధునాతన పరిశోధనాలయాలలో పని చేయడానికీ, విద్యార్థుల వసతి గృహంలో వుండడానికీ అవకాశాలను పొందిన కొత్తగా వచ్చిన వారిని ప్రతి ఆకురాలు కాలంలో, లెనిన్ కొండలపై నున్న మాస్కో విశ్వవిద్యాలయ వృక్షాలు ఆహ్వానిస్తాయి.*

*మాస్కోలో చదువుకోడానికి పలు దేశాలనుండి వచ్చిన* **1500** *మంది విద్యార్థి యువకులు అక్కడ వున్నారు. వారిలో చాలామందికి అంతర్జాతీయ విద్యార్థి సంఘ విద్యార్థి వేతనం లభిస్తుంది. సోవియట్ దేశంలో విదేశీ విద్యార్థుల జీవితం గురించి యీ పుటలో ప్రచురిస్తున్నాము.*

వివిధ దేశాలనుండి యీ విదేశీ విద్యార్థులు మాస్కోకు వచ్చి సంవత్సరానికి కాస్త పైగా అయ్యింది. వీరు గ్రీసునుండి వచ్చిన థియొదోరా. ఇండొనీషియా నుండి వచ్చిన నొన్నో. లెబనాన్ నుండి వచ్చిన స్పిరో, సుడాన్‌కు చెందిన యూసిఫ్ ఆతిధ్యం యిస్తున్నాడు. ఒకరిమాట ఒకరికి తెలియకపోయినా, మాస్కో చేరగానే వారంతా మిత్రులయిపోయారు. ఇండొనీషియా భాషకూ అరబ్బీ లేక గ్రీకు భాషకూ పోలికే లేదుగదా. కాని కొద్ది నెలలు చదువుకున్నాక వారికి ఉమ్మడిభాష ఒకటి లభించింది—అది రష్యన్.

మొదటి నాలుగైదు నెలలు, దీక్ష, గొప్ప నైపుణిగల ఉపాధ్యాయులు కొత్తవారికి రోజుకు నాలుగైదు గంటలు రష్యన్ భాషను నేర్పుతారు. ఈ శిక్షణ అయిన తరవాతను మాత్రమే వారు తాము ఎంచుకున్న విషయాలపైని ఉపన్యాసాలకు హాజరు కాగలరు. విదేశీయులకు రష్యన్ భాషా బోధనశాఖ దర్శకుడు సొరొకిన్‌ను అందరూ "బాబాయి"గా ఎరుగుదురు. ఆయన తన విద్యార్థులను తన బిడ్డలుగా చూస్తారు. యూసిఫ్‌గాని, నొన్నోగాని, యింకెవరుగాని ఎన్నడూ ఆయనను మర్చిపోరు.

నెలకు తొమ్మిదివందల రూబుళ్ళ పైకంలో అంతర్జాతీయ విద్యార్థి సంఘంనుండి వచ్చే విద్యార్థి వేతనాలు కాక విద్యార్థులకు, చలికాలపు దుస్తులు, జోళ్ళు కొనుక్కోవడానికి మూడువేల రూబుళ్ళు యివ్వబడతాయి. మంచంటే ప్రజలకు ఏమీ తెలియని దేశాలనుంచి వచ్చిన వారు, వారిలో చాలామంది వున్నారు.

గత వేసవిలో "బాబాయి" తన గదిలోనికి వచ్చి యోగక్షేమాలు, భోజనం సంతృప్తికరంగా వుందా అనీ, చలిగా వుండడం లేదా అనీ అడగడం నొన్నోకు జ్ఞాపకం వుంది. గదిలో శీతోష్ణస్థితి సున్నకు 23 సెంటీగ్రేడ్ డిగ్రీలు ఎక్కువగా ఉన్నప్పటికీ, నొన్నోకు యింకో వెచ్చని కంబళి యివ్వాలని ఆయన ఆజ్ఞాపించారు!

రష్యన్ విద్యార్థులు చాలమందితో కూడా వారు స్నేహం చేశారు. వారందరూ వేరువేరు విషయాలు అధ్యయనం చేస్తున్నారు—థియొదోరా శాస్త్రం, నొన్నో శక్తిశాస్త్రం, యూసిఫ్, స్పిరో వైద్య శాస్త్రం. వారందరికీ వ్యవధి తక్కువగావుంది, వారు చదవవలసింది యెంతోవుంది. అందుచేతనే నొన్నో అంటే వారికి అసూయ. ప్రతి పని చేసుకోవడానికీ వీలుగా తన కాలాన్ని ఎలా నడుపుకోవాలో అతనికి తెలుసును. ఉదాహరణకు, అతను యీవేళ పరిశోధనాలయంలో చాలా గంటలు గడిపినట్టయితే, సాయంత్రం యీత చెరువుదగ్గర ఆతను తప్పక కనిపిస్తాడు. అతను బారల యీత అభ్యసిస్తున్నాడు, యీ శిక్షణను శ్రద్ధగా చేస్తున్నాడు. ఇంతే కాకుండా అతనికి నాటకాలంటే చాలా యిష్టం. ఈ రంగంలో అతని ఏకైక ప్రత్యర్థి చంద్రనాథ్ చక్రవర్తి. ఇతను రెండేళ్ళ క్రితం మాస్కోకు వచ్చిన భారతీయ విద్యార్థి; రష్యన్ నృత్యనాటకంలో సిద్ధహస్తుడని యితను పేరుపడ్డాడు.

తమ చదువుకోసం ఏర్పాటు చేయబడిన వసతులు విదేశీ విద్యార్థులకు చాలా సంతృప్తికరంగా వున్నాయి, ఎంతో మందితో స్నేహం అయినందుకు వారు ఆనందిస్తున్నారు. ఉపాధ్యాయ బృందానికి, డీన్ పెత్రోవ్‌స్కీకికూడా వారిపట్ల ప్రశంసాభావం తప్ప ఇంకొకటి లేదు; వారు చదువులో శ్రద్ధగలవారనీ, తమ విశ్రాంతి కాలాన్ని ఆనందంగా ఎలా వినియోగించుకోవడమో వారెరుగుదురనీ చెప్తున్నారు.



కుడిప్రక్కనున్న సోవియట్ స్నేహితురాలితో సుడాన్, గ్రీస్, ఇండొనేషియా విద్యార్థులు సంభాషిస్తోన్న దృశ్యం —ఛాయాచిత్రకారుడు: ఎం. మురజోవ్

# తిమిర్యాజేవ్ వ్యవసాయ పరిషత్తు



వి. బొగొస్లోవస్కీ, 'సోవియట్ భూమి' విలేఖరి

(ఛాయాచిత్రకారుడు : ఎం. ఒజోర్‌స్కీ)

మాస్కోలోని చాలా పాత వ్యవసాయ కళాశాలల్లో ఒకటైన తిమిర్యజేవ్ వ్యవసాయ పరిషత్తు పట్టభద్రుల సేవలను పొందని వ్యవసాయమండలం, సోవియట్ దేశంలో ఒక్కటీ లేదు.

ప్రొఫెసర్ లోర్క్, ప్రొఫెసర్ ఎడెల్‌స్టీన్, రష్యన్ రిపబ్లిక్ వ్యవసాయ మంత్రి బెనిదిక్తోవ్, లెనిన్ వ్యవసాయ శాస్త్ర పరిషత్తు అధ్యక్షుడు లొబొనోవ్ వంటి ప్రముఖ సోవియట్ విజ్ఞానశాస్త్రవేత్తలూ, సుప్రసిద్ధులూ, సామ్యవాద శ్రమ వీరుడు, డాన్ తీరానవున్న స్టాలిన్ సమిష్టిక్షేత్రం అధ్యక్షుడూ అయిన ఓల్కోవ్ వంటి కార్యరంగంలో పనిచేస్తోన్న సుప్రసిద్ధ ప్రవీణులూ యీ పట్టభద్రులలో వున్నారు. పందల కొలదీ తిమిర్యజేవ్ పరిషత్తు పట్టభద్రులు బీడుభూములలోని ప్రభుత్వ క్షేత్రాల్లో పనిచేస్తున్నారు. సోవియట్ రైతాంగానికి వ్యవసాయ పరిషత్తు గురించి తెలుసును; అదంటే వారికి గాఢమైన ప్రేమ. సోవియట్ దేశంలోని అత్యున్నత బహుమానమైన ఆర్డర్ ఆఫ్ లెనిన్ యీ పరిషత్తుకు యివ్వబడింది, అది ప్రజలకు చేసిన గొప్ప సేవలకు.

## మాస్కోలోని వ్యవసాయ నగరం

నేనూ, ఛాయాచిత్రగ్రాహకుడు మిహాయిల్ ఒజోర్‌స్కీ యీ పరిషత్తుకు వెళ్ళినప్పుడు, దాని గ్రంథాలయంలో చాలా గంటలసేపు వున్నాము. ఆ గ్రంథాలయంలో పది లక్షలకు పైగా గ్రంథాలున్నాయి. దాని అసంఖ్యాకమైన పరిశోధనాలయాలను ఆ స్వల్ప వ్యవధిలో చూడలేకపోయాము. మాకు వారు చూపదలుచుకున్న దాని నంతట్నీ చూడడం సాధ్యపడలేదు. ఈ వ్యవసాయ కళాశాలకు 300కుపైగా విజ్ఞానశాస్త్రపు గదులూ, పరిశోధనాలయాలూ, క్లాసుగదులూ ఉన్నాయి. ఈ పరిషత్తుకు 700 హెక్టార్లకు పైగా భూమివుంది. దీనిలో ఒక పలుజాతుల తరుసంతతిగల ఉద్యానవనమూ, ఒక పళ్ళతోట, పాలశాఖ, సుమారు పది ప్రయోగకేంద్రాలూ, ఒక పశుప్రజనన క్షేత్రమూ వున్నాయి.

"మీకు ఎంతమంది విద్యార్థులున్నారు?" అని రెక్టర్ కార్యాలయంలో మేము అడిగాము.

"సుమారు నాలుగువేలమంది" అని జవాబు వచ్చింది.

ఈ యువతీయువకులు ఎలా జీవిస్తున్నారు, చదువుతున్నారు, విశ్రాంతి తీసుకుంటున్నారు? వారి వినోద కార్యక్రమాలేమిటి? మర్నాడు వీటన్నిటి గురించి కనుక్కోవాలనుకున్నాం.

## పరిషత్తు విశిష్టత

దాని విద్యార్థులు నేరుగా ఉన్నత పాఠశాలలనుండి వచ్చినవారుకారు, వ్యవసాయక్షేత్రాల్లో పలు సంవత్సరాలు పనిచేసి బాగా తెలిసివుండి యీ ప్రత్యేక విద్యను తెలుసుకున్నవారు వీరు. ఇతర కళాశాలల్లోని వారికంటె దీనిలో మాకు అధికంగా యిటువంటివారు కనిపించారు. ఇది దీని విశిష్టత.

పాఠశాలనుండి నేరుగా వచ్చినవారూ చాలామంది యిక్కడ వున్నారు. కాని వీరు పూర్వపు ట్రాక్టరు డ్రైవర్లు, సమిష్టి రైతులు, ప్రభుత్వ క్షేత్రాల పనివారూ. ఇక్కడి వాతావరణాన్ని సృష్టించింది వీరే.

"ప్రభుత్వ క్షేత్రాలనుంచి, సమిష్టి క్షేత్రాలనుండి వచ్చినవారు తప్పనిసరిగా మంచి విద్యార్థులుగా ఉంటారు" అని రెక్టర్ కార్యాలయంలో మాకు చెప్పారు.

విద్యార్థులను కలుసుకున్నప్పుడు కూడా యిదే అభిప్రాయం మాకు కలిగింది.

వ్యవసాయశాస్త్ర శాఖలో శ్రద్ధాసక్తులుగల యిద్దరు అమ్మాయిలు మాకు కనిపించారు. మారియా విరియప్స్, ఆమె స్నేహితురాలు లీనా ఆర్తెమెంకో "అద్భుతమైన" విద్యార్థినులయ్యారు. కాని వారు "స్థానికుల"నీ, అక్కడే పుట్టి అక్కడే పెరిగినవారనీ తదుపరి తెలిసింది.

మారియా దొరొజ్కినా చురుకుదనమూ, ఉత్సాహమూ గల రెండో సంవత్సరపు విద్యార్థిని. ఈ శాఖ గ్రంథాలయంలో మేము యీమెతో మాటాడాము. దూరానవున్న రైజాన్ మండలపు సమిష్టి క్షేత్రంనుండి మాస్కోలో చదువుకొనడానికి వచ్చింది. ఆ అమ్మాయి యింకా మూడేళ్ళు చదవాలి. క్రిమిశాస్త్రం, శీతోష్ణస్థితి శాస్త్రమూ, మృత్తికా శాస్త్రంవంటి సుమారు నలభై పాఠ్యాంశాలున్నాయి అధ్యయనం చేయవలసినవి. ఈ పాఠ్యాంశాలన్నిట్లోనూ సవ్యమూ, ఆసక్తి జనకమూ అయినవి ఎన్నో వున్నవి.

ధన సహాయం కావలసిన ఆమె స్నేహితులందరి కిచ్చినట్లుగానే ఆమెకు ప్రభుత్వం విద్యార్థివేతనం యిస్తుంది. చదువుపట్ల ఆమెకుగల వాంఛ అపారం.

మారియా దొరొజ్కినా వద్దనుండి సెలవు పుచ్చుకుంటూ, రైజాన్ మండలంలోని ఆమె సమిష్టిక్షేత్రానికి మూడేళ్ళ తరవాత



రైజాన్ మండలంలోని తన సమిష్టిక్షేత్రంలో వ్యవసాయ శాస్త్రజ్ఞురాలు కావడానికి రెండవ సంవత్సర విద్యార్థిని మరియా దొరొజ్కినా అధ్యయనం చేస్తున్నది (ఆంతర చిత్రం)

ఉపన్యాస మందిరంలో

అద్భుతమైన స్వంత వ్యవసాయ శాస్త్రజ్ఞురాలు తప్పక లభిస్తుందన్న నమ్మకంతో బయలుదేరాము.

## విజ్ఞానశాస్త్ర జగత్తులోనికి ఒక అడుగు

ఈ పరిషత్తుకు వైజ్ఞానిక విద్యార్థి సంఘం వుంది, విజ్ఞానశాస్త్ర ప్రపంచంలోనికి వారు అడుగిడేందుకు సహాయపడడానికి. ఇక్కడ పై తరగతుల విద్యార్థులు, తమ ఉపాధ్యాయులచే బోధింపబడి, తమకు ఆసక్తిగల ఏదో వైజ్ఞానిక సమస్య గురించి కృషి చేస్తారు, కళాశాలలో తమ మామూలు పనిని సాగిస్తూనే.

మేము కృత్రిమ శీతోష్ణస్థితి పరిశోధనాలయానికీ, వ్యవసాయ యంత్రాల శాఖకూ, అశ్వ ప్రజననశాల మ్యూజియం మొదలైన వాటికి చూశాము. వీట్లలో తీవ్రంగా పరిశోధన సాగిస్తోన్న విద్యార్థులు మాకు కనిపించారు.

ఈ పరిశోధన విద్యార్థులు సాగించే కృషిలో చాల భాగం, పరిషత్తు ప్రయోగక్షేత్రాలలో జరుగుతోంది. ఇక్కడ భావి ప్రవీణులు గోధుమ, జొన్న, బంగాళా దుంపలు అధికంగాపండే కొత్త రకాలను పండించడంలో నిమగ్నులై వుంటారు. ప్రయోగ క్షేత్రాలనుండి ప్రభుత్వ క్షేత్రాల, సమిష్టిక్షేత్రాల పొలాలకు వెళ్ళగల రకాలను పెంపొందించాలని వారు కలలు గంటుంటారు.

## లార్చ్ లేన్ గృహంలో

మా సందర్శనలో ముఖ్యభాగం అయిపోయాక, విద్యార్థులు



ప్రొఫెసర్ తిమొఫెయేవ్, ప్రసిద్ధ అటవీ శాస్త్ర నిపుణుడు, విద్యార్థులకు శంఖాకృతిలో వున్న వృక్షముల సంవత్సరపు పెరుగుదలను నిర్ధరించే విధానాలను వివరిస్తోన్న దృశ్యం (పైచిత్రం)



ఎగువ నాగలితో వున్న కొత్తరకపు ట్రాక్టరునుగురించి విద్యార్థులు ఉత్సాహతతో చర్చిస్తున్నారు (రెండవ చిత్రం)



గుర్రాల పెంపకపు ప్రదర్శనశాలలో వివిధజాతుల అశ్వాలను చూపించే చిత్రాలు, శిల్పాలు అనేకం ఉన్నాయి (మూడవచిత్రం)



కృత్రిమ వాతావరణ పరిశోధనాలయంలో శాస్త్ర విభాగ సిబ్బందికి సంబంధించిన ఈ స్త్రీలు, శాస్త్రీయ సమస్యలలో ప్రధానమైన ద్యుతి సంశ్లేషణ విషయంలో ఎక్కువ ఆసక్తి వహిస్తున్నారు (దిగువ చిత్రం)



"రాత్రి భోజనాలకు ఇవ్వాళ మేమే వంటచేసుకోవడానికి నిశ్చయించుకున్నాం" అని చెబుతున్నది ఒక అమ్మాయి "ఇప్పటికి రెండు నెలలనుంచీ భోజనశాలలో పడ్డిస్తే భోంచేస్తున్నామా, ఇక ఇట్లాగే గడిస్తే మేము వచ్చిన వంటే మరిచిపొయ్యేట్టుంది"



డోమినోస్ ఆట తీవ్రమైన అధ్యయనం మధ్య ఒక చక్కటి వినోదం



సమోవారీస విషయాలనుగురించి ఉపన్యసించిన ద్వితీయను, న్యాయ-సంవత్సరం విద్యార్థి సెన్యా పెరోవ్ పాడి మాకు వినిపించాడు

స్వారీచేస్తున్న ఈ వనితలు, గుర్రపు స్వారీని గురించి చెప్పుకొన్న ప్రతి పలుకు పలుకూ మేము తెలియపర్చగలిగినట్టయితే మా పాఠకులలో అనేకులు రౌతులైపోతారు



ఎలా వుంటున్నారో చూద్దామనుకున్నాం. అందుకోసం, విద్యార్థుల వసతి గృహాలు వున్న లార్చ్ లేన్ వేపు వెళ్ళాం.

ఒక యింటిలో ప్రవేశించి మాకు దగ్గరగావున్న తలుపు తట్టాము. ఇక్కడ మాకు విశ్రాంతి తీసుకుంటోన్న కొందరు విద్యార్థులు కనిపించారు. డోమినోస్ ఆటలు, చదరంగం, మంచి పాటలు.

"ఎవ్వరిగురించో నిట్టూర్చేకంటె, యీ విధంగా యెక్కువ విశ్రాంతిగా వుంటుంది" అన్నారు యిక్కడవున్న కుర్రవాళ్ళు.

మేము విద్యార్థినుల వసతి గృహాలకుకూడా వెళ్ళాం. అక్కడ కొందరు బాలికలు వంటింట్లో కనిపించారు. వారు సరదాగా వండుతున్నామన్నారు.

ఆ సాయంత్రం మేము చాలా గదులకు వెళ్ళాం. ఒక గదిలో విద్యార్థులు కొందరు తీవ్రంగా రాజకీయాలు చర్చిస్తున్నారు. ఇంకో గదిలో నిద్రముఖంతో వున్న ఒక యువకుడు "వాళ్ళంతా క్లబ్బుకు వెళ్ళిపోయారు" అని చెప్పి యింకో ప్రక్కకు తిరిగి మళ్ళీ నిద్రపోయాడు. ఇంకోగదిలో గ్రామొఫోను కులాసాగా పాడుతోంది.

విద్యార్థులంతా విశ్రాంతి తీసుకుంటున్నారు, తమ పని అయ్యాక ఎవరికి యిష్టంవచ్చినట్టుగా వారు . .





విరామ సమయాన్ని ఈ యువతీ యువకులు పడవ నడుపుటలో గడపటానికి నిశ్చయించుకున్నారు



ప్రోత్సాహిత కళా బృంద సభ్యులు ఇద్దరు ఒక జానపద నృత్యాన్ని ప్రదర్శిస్తోన్న దృశ్యం

## ఇతర వ్యాసంగాలు

ఈ పరిషత్తు విద్యార్థులు పాల్గొనని క్రీడ ఏదీ వున్నట్టుగా లేదు. వారికి అద్భుతమైన స్కీ బృందం, వ్యాయామశాఖ, ఫుట్‌బాల్, వాలీబాల్, బాస్కెట్ బాల్ బృందాలూ వున్నాయి, పడవ నడిపేవారూ, టెన్నిస్ ఆటగాళ్ళూకూడా వున్నారు.

క్రీడలే కాకుండా, పరిషత్తు విద్యార్థులకు నాటకాలు కూడా చాలా యిష్టం. క్లబ్బులో అనేక కేంద్రాలున్నాయి; నాటక, నృత్య కేంద్రం: విద్యార్థుల బృందగాన కేంద్రం, తంత్రీవాద్య బృందం వంటివి.

ఎక్కువపుటలతో వస్తోన్న పరిషత్తు వార్తా పత్రికకు సంపాదకులు, ప్రచురణకర్తలూ విద్యార్థులే. దీనిలో తరచుగా యీ విద్యార్థి అమెచ్యూర్ కళా కేంద్రాల ప్రదర్శనల గురించి వ్యాసాలుంటాయి.

సోవియట్ ఉన్నత విద్యాసంస్థలు 767 లో ఒకటైన తిమిర్యజేవ్ పరిషత్తు విద్యార్థుల కార్యకలాపాలన్నిటినీ తెలుసుకోవడానికి మాకు చాలారోజులు పట్టింది. ఇక్కడ శిక్షణను పొందినవారు, కేవలం తమ విషయాలలో ఆసక్తిగల ప్రథమశ్రేణి వ్యవసాయ ప్రవీణులు మాత్రమేగాక ఎన్నో విషయాలలో ఆసక్తిగల ఆరోగ్యవంతులూ, ఆనందవంతులూ అవుతారన్న నమ్మకంతో మేము గృహోన్ముఖుల మయ్యాము.



ఉద్యానవన వాటికలలో సాయంత్రంపూట విహరించే జంటలు తరచు కనుపిస్తాయి





# విప్లవం నిర్మూలించిన అనర్థాలు

నిరుద్యోగం, ఆకలి, దారిద్ర్యం, దేశద్రిమ్మరితనం, వ్యభిచారం, బాలలు, స్త్రీలతో కఠినమైన పనులు చేయించడం—ఇవి అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం నలభై సంవత్సరాల క్రితం గావించిన జీవితాంశాలలో కొన్ని

వాటిలో ప్రతి ఒక్కటి మానవాళికి ప్లేగు వ్యాధిలాంటిదని అనవచ్చును. కొందరు సాంఘిక శాస్త్రవేత్తలు, అనగా మానవ సమాజ చరిత్రను అధ్యయనం చేసేవారు, ఈ పీడలు యెన్నటికీ వదిలేవి కావని నమ్మడం కూడా జరుగుతూ వచ్చింది. సోవియట్ దేశంలో నూతన సోషలిస్టు సమాజం నిర్మింపబడుతున్న సమయంలో యీ అనర్థాలన్నీ, కొన్ని క్రమంగాను, మరి కొన్ని త్వరితగతిని, రద్దుగావింపబడ్డాయి. "మానవాళి యొక్క యీ అనర్థాలు" యేవిధంగా తొలగింపబడ్డాయో ఒకసారి సూక్ష్మంగా పరిశీలిద్దాము. ఇప్పటి తరం వారికి ఆ విషయాలు ఎవరైనా పెద్దవాళ్ళు మాట్లాడుకొంటున్న సందర్భంలోను, పాత పుస్తకాలలోను, మా పాఠకుల కొరకు సోవియట్ దేశ ప్రభుత్వ ప్రాచీన పత్ర నిలయం నుండి మేము సేకరించిన ఛాయాచిత్రాల ద్వారాను మాత్రమే తెలుస్తుంటాయి.

**దిగువ ఛాయాచిత్రం మాస్కోలో 1912వ సంవత్సరంలో తీయబడింది. అది ఒక "లేబర్ ఎక్స్ఛేంజ్" కార్యాలయం. దాని రూపమే యెంతో విషాదకరంగా కనబడుతూ వుంటుంది. వందలాది నిరుద్యోగులు "కూలికి మనుష్యులు కావాల"న్న శుభవార్తను వినడానికి ఆ కార్యాలయంచుట్టూ మూగి వుండేవారు.**

సోవియట్ దేశంలో నిరుద్యోగం విప్లవమైన వెంటనే అంతరించలేదు. ప్రపంచ యుద్ధమూ, అంతర్యుద్ధమూ జాతీయార్థిక రంగాన్ని పూర్తిగా విచ్ఛిన్నం గావించాయి.

విచ్ఛిన్నమైపోయిన ఆర్థిక విధానము పరిశ్రమలకు అవసరమైన ముడి సరుకులను సరఫరా చేయలేకపోవడంవల్ల యంత్రాగారాలు మూలపడ్డాయి. కాని ఈ శతాబ్దం మూడవ దశాబ్దాంతంలో దేశ పారిశ్రామీకరణకు బ్రహ్మాండమైన పథకం తయారు చేయబడి, పని ప్రారంభింపబడింది. మొదటి ఐదు సంవత్సరాల కాలంలోనే వెయ్యికి పైగా పారిశ్రామిక సంస్థలు స్థాపింపబడి పనిచేయసాగాయి. పాత యంత్రాగారాలు విస్తృతం గావింపబడ్డాయి. 1931 కల్లా నిరుద్యోగం పూర్తిగా అంతరించిపోయింది. అది మొదలుకొని సోవియట్ దేశంలో నిరుద్యోగం మళ్ళీ తలెత్తలేదు, ముందు తలెత్తదు కూడాను.

ఒక్కొక్కప్పుడు విదేశీయులు సోవియట్ ప్రజలను ఇలా అడుగుతుంటారు: "మీరు పరిశ్రమలలో స్వయంచలనీకరణ పద్ధతిని ప్రవేశపెడుతున్నారు. వ్యవసాయంలో యంత్రాలను ప్రవేశపెడు

మాస్కో లేబర్ ఎక్స్ఛేంజ్ (1912)



తున్నారు. ఎప్పటికప్పుడు కొత్త యంత్రాగారాలు లేస్తూనేవున్నాయి. అటువంటప్పుడు మార్కెట్టంతా వస్తువులతో నిండిపోయి, అధికోత్పత్తి జరిగి, ఆర్థిక దుస్థితి యేర్పడదా ? ఆ సమయంలో కొందరు కార్మికులు అనవసరం అవరా ?" కాని సోవియట్ ప్రజలు దీనికి యీ విధంగా జవాబిస్తారు : "లేదు, అలాంటిదేదీ మా దేశంలో జరుగదు."

సోవియట్ నగరవీధుల్లో "కార్మికులు కావాలి" అన్న ప్రకటనలు, పత్రికల్లో "టర్నర్లు, పెల్లర్లు.........కావాలి" అన్న వార్తలు యెప్పుడూ కనబడుతూనే ఉంటాయి.

వ్యవసాయంలో యంత్రాలు ప్రవేశపెట్టడంవల్లా పరిశ్రమల్లో స్వయంచలినీకరణ పద్ధతులను ప్రవేశపెట్టడంవల్లా సోవియట్ కార్మికులు తక్కువ గంటలు పనిచేయడానికి వీలవుతున్నది. ఇప్పుడు నడుస్తున్న పంచవర్ష ప్రణాళిక సమయంలో, సోవియట్ దేశంలో ఎనిమిది గంటలపనిరోజుకు బదులు, జీతం కోతలేకుండా ఏడు గంటల పనిరోజు ప్రవేశపెట్టబడుతున్నది. భవిష్యత్తులో పనిరోజు గంటలు ఇంకా తగ్గుతాయి.

"జనాభాలో పెరుగుదల మాటేమిటి ?" అని కూడా కొందరు పాఠకులు అడుగుతుంటారు. త్వరితగతిని పెరుగుతున్న జనాభా మూలంగా నిరుద్యోగ సమస్య యెదురవ్వదా ? జనాభా పెరుగుదల చాలా అధికంగా వున్న సోవియట్ దేశం అనుభవాన్నిబట్టి, సోషలిస్టు దేశంలో, దాని జాతీయార్థిక విధానం ఒక స్థాయికి చేరుకొని వేగంగా అభివృద్ధిని పొందుతూ వున్నట్లయితే, జనాభాలో అభివృద్ధి నిరుద్యోగానికి యే మాత్రమూ దారితీయదని వెల్లడవుతున్నది.

పూర్వపురోజుల్లో, కార్మికునికి పనిలేనప్పుడు చాలా సందర్భాల్లో, బిచ్చమెత్తుకోవడం తప్ప వేరేమార్గం ఉండేదికాదు. నిరుద్యోగులు బిచ్చగాళ్ళుగా తయారయ్యేవారు. జారిస్టు రష్యాలో వేలకొలది బిచ్చగాళ్లుండేవారు. బ్రతుకు చితికిపోయిన రైతులు, ఇండ్లు కాలిపోయినవారు, అశక్తులు కూడా ఇలా బిచ్చమెత్తుకొంటుండేవారు. ఉక్రెయిన్‌కు చెందిన సారవంతమైన రేగటిమట్టి ప్రాంతంలోని పోల్తవా గుబర్నియాలోని మార్కెట్టు వీధుల్లో బిచ్చమెత్తుకొంటున్న ఒక కుటుంబాన్ని దిగువ చిత్రంలో చూడవచ్చును. ఇది 1907లో తీయబడింది.

సోవియట్ దేశంలో అందరికీ పని దొరుకుతుండడం మూలానా, అశక్తులు, వృద్ధులకు ప్రభుత్వ భృతి లభిస్తుండడం మూలాన అక్కడ భిక్షాటనకు దారితీసే ఆర్థిక పరిస్థితులు రూపుమాసిపోయాయి. వృద్ధులు, అశక్తుల కొరకు ప్రత్యేక గృహాలు కూడా ఉన్నాయి. అనావృష్టివల్ల పంటలు పాడైన రైతులకు ప్రభుత్వం అప్పులిస్తుంది.

కాని సోవియట్ దేశ వీధుల్లో బిచ్చగాళ్ళు కనబడుతుంటారా? కనబడుతూ ఉంటారుగాని, అది చాలా అరుదు. వాళ్లెవరు ? ఈ "బిచ్చగాళ్ళు" ఇతరులను మోసంచేయడం ద్వారా బ్రతకాలని ఇంకా ప్రయత్నించే రకానికి చెందినవారు. త్రాగుడుకు, జూదానికి, ఇంకా అలాంటి విషయాలకు డబ్బు సంపాదించడానికి వాళ్ళలా ప్రయత్నిస్తుంటారు.

సోవియట్ దేశంలో నేరాలు జరిపేవాళ్ళు ఇంకా వున్నారు. వారు ఆ నేరాలను చేయడానికి కారణం ఆకలిగాని, ఇతర అవసరాలుగానికావు. వారి శిక్షణలో యేదో లోపం ఉండడంవల్ల, సాంఘిక నైతిక సూత్రాలను విస్మరించడంలో ఆ నేరాలు సంభవిస్తున్నాయి. మా సమాజంలో చెడుప్రవర్తనగలవాళ్ళు ఇంకా వుండడం మా దురదృష్టమేగాక, అపరాధం కూడాను. బడిలోను, కుటుంబంలోను, లేదా పనిచేసేచోట సక్రమమైన శిక్షణ ఇవ్వబడినట్లయితే నైతిక సూత్రాల అతిక్రమణ అంతరించి పోతుందని సోవియట్ ప్రజలకు తెలుసు. సోవియట్ దేశంలో నేరాల సంఖ్యా, సామాజిక నైతిక సూత్రాలను అతిక్రమించేవారి సంఖ్య క్రమంగా తగ్గుతున్నది. శిక్షణలో క్రమంగా అభివృద్ధి రావడం ఫలితమే ఇది.

సత్రపు వెలుపల



పోల్టావా గుబెర్నియాలోని బిచ్చగాళ్ళు





క్రవ్‌చెన్కో కుటుంబానికి చెందిన ధాన్యపు కొట్టు నుంచి యవ్‌దొకిమ్ క్రవ్‌చెన్కో, ఆయన కుమారుడు అనతోలీ పిండి మరకు ధాన్యాన్ని తీసుకపోవడానికి సన్నాహాలు చేస్తోన్న దృశ్యం

★

విప్లవానికి పూర్వపు రష్యాలోని వీధుల్లో బిచ్చగాళ్ళతోపాటు "బజారు స్త్రీలు" గూడా తప్పనిసరిగా కనబడుతూ వుండేవారు. అలాంటి స్త్రీలు వేనకువేలు ఉండేవారని రష్యన్ అధికార సంఖ్యా వివరాలు తెలియజేస్తున్నాయి.

★

రైజాన్ గుబెర్నియాలోని బగిచెవ్కా గ్రామంలో క్షామకాలంలో లియో టాల్‌స్టాయ్



విప్లవానంతరం సోవియట్ ప్రభుత్వం వ్యభిచారానికి కారణభూతమయిన పరిస్థితులకు వ్యతిరేకంగా, నిరుద్యోగం, దారిద్ర్యం, వ్యభిచారాలకు వ్యతిరేకంగా పోరాటాన్ని ప్రారంభించింది. "బజారు స్త్రీలం"దరికి ప్రథమచర్యగా యేదో ఒక పని చూపింపబడి, తర్వాత ఏదో ఒక వృత్తి నేర్పింపబడింది.

మాక్సిమ్ గోర్కీ రచనలు చదివినవారందరికి బోస్యాక్ (దేశద్రిమ్మరి) అన్న పదం సుపరిచితమయ్యే ఉంటుంది. జీవితంలో అధమాధమపు స్థితికి చేరుకొన్న వ్యక్తి ఇతడు. చేయిచాచి బిచ్చమెత్తుకొనే స్థితికి ఇంకా దిగజారనివాడు. అక్కడక్కడా యేవైనా పనులు చేసుకొంటూ ఇష్టమొచ్చినట్లుగా దేశమంతటా తిరుగుతూ ఉండే దేశద్రిమ్మరి. ఇలాంటివాళ్ళ జేబుల్లో మిగిలివున్న కొద్ది డబ్బులను గుంజుకోడానికి కొందరు ప్రబుద్ధులు రాత్రులు తలదాచుకోను స్థలాన్ని అద్దెకిస్తుండేవారు. ఇరుకైన ప్రదేశాల్లో, కొయ్య పడకలమీద ఆ దేశద్రిమ్మరులు రాత్రులు గడుపుతూ ఉండేవారు. విప్లవానికి పూర్వం తీయబడిన 13 వ పుటలో ఎడమనున్న చిత్రం మాస్కోలోని యిలాంటి ఒక గృహాన్ని చూపుతున్నది. రాత్రి పడుకొనేందుకు ఆ గృహం ఎప్పుడు తెరువబడుతుందా అని వాళ్లు యెదురు చూస్తున్నారు.

పాత రష్యా యొక్క యీ "దేశద్రిమ్మరి జీవితాన్ని" విప్లవం పూర్తిగా అంతమొందించింది. సోవియట్ దేశంలో ఇప్పుడు దేశద్రిమ్మరులుగాని, ఊరూరు తిరిగి పనిచేసుకొనే కార్మికులుగాని, దేశద్రిమ్మరులకు రాత్రులు పడుకొను స్థలం అద్దెకిచ్చే గృహాలుగాని లేవు.

రష్యన్ మహారచయిత లియో టాల్‌స్టాయ్ 1891లో రైజాన్ గుబెర్నియాకు చెందిన బెగిచెవ్కా గ్రామంలో తీసిన ఛాయాచిత్రాన్ని ఇక్కడ ప్రచురించాము. కరువుతో మాడుతున్న రైతులకు సహాయం చేయడానికి ఆయన వెళ్ళినప్పుడు తీసిన చిత్రమది (14వ పుట దిగువ). అనేక పర్యాయాలు ఆయన కరువుకు గురియైన గ్రామాలకు అలా వెళుతుండేవారు. వందలాది ఇతర రష్యన్ మేధావులు గూడా రైతులకు సహాయం చేయడానికి ఇలా వెళుతుండేవారు. దేశమంతటా చందాలు వసూలు చేయబడేవి. విదేశాలనుండి కూడా వచ్చేవి. యీ చందాలు. కాని యీ వ్యక్తిగత సహాయమూ, కరువుతో మాడేవాళ్ళకు సహాయం చేయడానికి రష్యాలోని ఉత్తములు చేస్తూవుండిన కృషీ, పరిస్థితులను యేమీ మార్చలేకపోయేవి. లెనిన్ సరిగ్గా చెప్పినట్లు, జారిస్టు అధికారులు ఆకలితోవున్నవారికి వ్యతిరేకంగా పోరాడుతున్నంతగా ఆకలికి వ్యతిరేకంగా పోరాడలేదు. అనవసరమైన భయాన్ని కల్పిస్తున్నారనీ, ప్రభుత్వ వ్యతిరేక భావాలను రెచ్చగొడుతున్నారనీ టాల్‌స్టాయ్‌పై వారు నేరారోపణలను చేశారు.

1901లో లెనిన్ యీ విధంగా వ్రాశారు : "రైతులకు సేద్యానికి యోగ్యమైన భూమి తగినంతగా లేకుండాచేసే పరిస్థితులు తొలగింపబడకుండా, భూస్వాముల భూములు జప్తు చేసుకొనబడకుండా, విప్లవం రాకుండా కరువుకు వ్యతిరేకంగా నిజమైన పోరాటాన్ని జరుపడం అసాధ్యం."

అలాంటి ఆకలిని తుదముట్టించినదే అక్టోబరు విప్లవం. శ్రామిక రైతాంగానికి భూమిని ఇచ్చింది. కొయ్యనాగలి స్థానంలో ట్రాక్టర్ ప్రవేశపెట్టబడింది. భూమికి యెరువులు వేయబడ్డాయి. వేడిగాడ్పులనుండి పంటలను రక్షించడానికి అడవులు నాటబడ్డాయి. ఆకలికి అలమటిస్తున్న రష్యన్ రైతాంగానికి విప్లవం ధర్మంగా వేసే రొట్టెముక్కలనుగాక, అన్నివిధాలైన వ్యవసాయికాభివృద్ధిని చేకూర్చింది. వ్యక్తిగత వ్యవసాయంకంటే లాభదాయకమైన సమిష్టి వ్యవసాయానికి ప్రోత్సహించింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో తానుచేసిన పనికి ఒక రైతుకు లభించిన ధాన్యాన్ని పిండిమరకు పంపుతూ వుండడాన్ని 14వ పుటలోని ఛాయాచిత్రంలో చూడవచ్చును.

★

సురా నదివొడ్డున పడవ లాగుడు స్త్రీలు






వి.ఐ. లెనిన్ వోల్గా-డాన్ కాలువమీద ప్రయాణించే "రోసా లగ్జెంబర్గ్" పొగ ఓడకు చెందిన నావికురాలు లిదియా పొసొఖినా

★

ఈ మధ్య గడచిన సంవత్సరాలలో లక్షలాది హెక్టర్ల బీడు భూమి సేద్యంలోకి తీసుకొని రాబడడంతో మా దేశంలో యింతకు ముందు కనీవినీ యెరుగనంత పంట పండింది. ధాన్యపు సమస్య శాశ్వతంగా పరిష్కరింపబడింది.

ఈ ప్రపంచంలో ఒక జారు వున్నాడు,
నిర్దయాపరుడైన జారు, అతనిపేరే ఆకలి

అంటూ రష్యన్ మహాకవి నెక్రసోవ్ వ్రాశారు. ఈ "జారు" యొక్క అధికారంగూడా సోవియట్ దేశంలో కూలద్రోయబడింది.

చెప్పులుకుట్టే అల్యఖిన్ దగ్గర పనికి మూడు నెలల క్రితం చేరిన తొమ్మిదేళ్ళ బాలుడు వాంకా జుకోవ్ కిస్మస్‌నాటి రాత్రి నిద్రపోలేదు, అంటూ, అన్ని సోవియట్ పాఠ్యగ్రంథాలలో కనబడే చెకోవ్ యొక్క "వాంకా" అనే ప్రఖ్యాత కథానిక ప్రారంభమవుతుంది. లక్షలాది రష్యన్ ప్రజలకు యీ కథ దాదాపు కంఠతః వచ్చును. ఇతరులకు ఊడిగంచేసే దుర్భర జీవితాన్ని గురించిన తన తాతకు తెలుపుకొంటూ ఒక ఉత్తరాన్ని వ్రాసిన బాలుని విషాదభరిత గాథ యిది. వాంకా జుకోవ్ ఇలా వ్రాస్తాడు : "దురదృష్టవంతుడైన అనాథ బాలుడిని నాపై దయచూపు. ఎందుకంటే, అందరూ నన్ను కొడుతున్నారు. నాకు యెంతో ఆకలి వేస్తున్నది. ఎంత భయంకరంగా వున్నదంటే, దానిని నేను చెప్పలేను. ఎప్పుడూ యేడుస్తూ వుంటున్నాను.



అనుభవజ్ఞుడైన ఈ కార్మికుడు తన బలిష్ఠ హస్తాలతో మొట్టమొదటిసారిగా సున్నితమైన ఈ కలాన్ని పట్టుకుంటున్నాడు

★

ఈ మధ్య మా యజమాని తలమీద కొట్టాడు. ఎంత గట్టిగా కొట్టాడంటే, చాలా సేపటివరకు నాకు స్పృహ రానేలేదు. నా జీవితం దుర్భరంగా వున్నది. కుక్క జీవితంకంటే నికృష్టంగా వున్నది."

వాంకా జుకోవ్‌లాంటి బాలుడు మీకు దిగువ ఛాయాచిత్రంలో కనబడుతాడు. తొమ్మిదేళ్ళ వయస్సు బాలబాలికలు రష్యాలో చేతి పనులవాళ్ళ దగ్గరా, ఫ్యాక్టరీలలోను, గనులలోను పనిచేస్తుండేవారు.

అక్టోబరు విప్లవానంతరం బాలలతో పనిచేయించడం నిషేధింపబడింది.

సోవియట్ దేశంలో బాలలు చదువులోను, క్రీడల్లోను విశ్రాంతిలోను కాలం గడుపుతుంటారు. వృత్తి విద్యా పాఠశాలకు చెందిన ఈ బాలలవైపు ఒకసారి చూడండి. వాంకా జుకోవ్‌కూ, వీరికీ ఎక్కడైనా పోలిక వున్నదా?

15 వ పుట దిగువ ఛాయాచిత్రంలో చూపబడిన స్త్రీలు బుర్లాచ్కి స్త్రీలు. నదుల్లో నీటి ప్రవాహానికి ఎదురుగా పోవలసివచ్చినప్పుడు ఒడ్డునుంచి పడవల్ని త్రాడుతో లాగేవాళ్ళను జారిస్టు రష్యాలో ఈ పేరుతో పిలిచేవారు. ఇది కష్టమైన పని.

ఆ రోజుల్లో శ్రామిక స్త్రీల పరిస్థితి పురుషుల పరిస్థితికంటే మరీ అధ్వాన్నంగా వుండేది. ఒకేరకమైన పనికి స్త్రీలకు పురుషులకంటే తక్కువ కూలి ఇవ్వబడుతుండేది. విప్లవం స్త్రీలను కఠినమైన పనులలో నియమించడాన్ని నిషేధించడంతోపాటు, వాళ్ళను ఉద్యోగాల్లో నియమించే అవకాశాలను ఇంకా యెక్కువచేసి, సోషలిస్టు నిర్మాణంలోకి వాళ్ళను ప్రవేశపెట్టింది.

ఈ ఛాయాచిత్రంలో చూపబడిన మనుష్యుని ముఖంలోని గంభీరతను ఒకసారి చూడండి: పనిలో ఆరితేరిన యీ కార్మికుడు బహుశ అతని జీవితంలో మొట్టమొదటిసారిగా కాబోలు వ్రాయడానికి ప్రయత్నిస్తున్నాడు. కఠినమైన శారీరక శ్రమకు అలవాటు పడిన ఆ చెయ్యి ఇంకా సరిగ్గా వ్రాయలేకపోతున్నది.

"మేము బానిసలంకాదు. బానిసలమైనది మేము కాదు." అక్టోబరు విప్లవానంతరం వర్ణక్రమం నేర్చుకొనడం మొదలుపెట్టిన కార్మికులు, రైతులు మొట్టమొదటగా వ్రాస్తూ వచ్చిన మాటలు ఇవే.

ఈ ఛాయాచిత్రం 1918 లో తీయబడింది. 8 నుండి 50 సంవత్సరాల మధ్య వయస్సుగలవారందరూ చదువుకోవాలని నిర్బంధిస్తూ ఒక ఉత్తరువు జారీ చేయబడింది. దీనిని అమలుపర్చడానికి పది లక్షల మంది ఉపాధ్యాయులు అవసరమయ్యారు. విప్లవానికి పూర్వం రష్యాలో ఏయోజనుల్లో నూటికి 27 మంది మాత్రమే అక్షరాస్యులుగా వుండేవారు. నిరక్షరాస్యతను నిర్మూలించే ఉద్యమంలో సోవియట్ ప్రభుత్వం పై ఉత్తరువును జారీ చేసింది. ఉపాధ్యాయులు, కార్యకర్తలు, తమ తండ్రులు, తాతలకు చదువునేర్పిన బాలసంఘం సభ్యులతోసహా కూడిన యీ లక్షలాది సాంస్కృతిక సైన్యం ఈ ఉద్యమంలో పాల్గొన్నది. నిరక్షరాస్యతా నిర్మూలనం కొరకు స్థాపింపబడిన పాఠశాలల్లో సంవత్సరానికి యాభై లక్షల మందికి పైగా చదువుకొంటూ వచ్చారు.

ఇప్పుడు సోవియట్ దేశంలో నిరక్షరాస్యులు లేరు. సోవియట్ పరిపాలనా కాలంలో సోవియట్ దేశంలో సాధింపబడిన సాంస్కృతిక విప్లవంలో నిరక్షరాస్యతా నిర్మూలనం ఒక భాగం.

పూర్వపు రష్యాలో ఇంత పసివాళ్ళు చేతిపనులలోను, కర్మాగారాలలోను, గనులలోను పనిచేయవలసివచ్చేది



వృత్తి పాఠశాల విద్యార్థులు ప్రాక్టికల్ శిక్షణపొందుతోన్న దృశ్యం



# ఎం. రదోవ్స్కి

(జగదీశ చంద్ర బోస్ 20వ వర్ధంత్యుత్సవ సందర్భంగా)



ప్రసిద్ధ భారతీయ వృక్ష, పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞుడు జె. సి. బోస్

శ్రీ జగదీశచంద్ర బోసు తనదేశానికి వెలపలనుకూడా పేరుపడ్డారు. రష్యాలో ఆయనపేరు సుపరిచితమే; రష్యన్ విజ్ఞాన శాస్త్ర వేత్తలు అత్యంత వైవిధ్యంగల ప్రకృతి శాస్త్రశాఖలకు యీ భారతీయ విజ్ఞానశాస్త్రవేత్త చేసిన గొప్పసేవను చాలా విలువైనదానిగా పరిగణించారు.

బోసు పనిచేసిన విజ్ఞానశాస్త్ర శాఖలలోనే పనిచేసిన అత్యంత ప్రముఖ రష్యన్ విజ్ఞాన శాస్త్రవేత్తలు వైర్లెస్ టెలిగ్రాఫీని కనిపెట్టిన ఏ. యస్. పొపోవ్, ప్రఖ్యాత వృక్ష శాస్త్రవేత్త కె. ఏ. తిమిర్యజేవ్.

పొపోవ్ విజ్ఞానశాస్త్ర పత్రాలను బట్టి ఆయన బోస్ పరిశోధన గురించి, యూరోపియన్ వైజ్ఞానిక పత్రికలలో సమాచారం వెలువడిన వెంటనే తెలుసుకున్నారని మనకు తెలుస్తుంది. ఒక లేఖలో ఆ రష్యన్ విజ్ఞానశాస్త్రవేత్త, 1896 లో జరిగిన బ్రిటిష్ వైజ్ఞానికాభివృద్ధి సంఘ సమావేశంలో జె. సి. బోస్ నివేదిక గురించి పేర్కొన్నారు. అదే సంవత్సరం ఎలెక్ట్రిషియన్ అన్న పత్రికలో బోస్ వ్యాసాన్ని చదివాక, పొపోవ్ ఒక ఉత్తరంలో యిలా వ్రాసేరు :

"ఇంగ్లీషు పత్రిక ప్రకృతి అక్టోబరు (1896) సంచికలలో బ్రిటిష్ సంఘం సమావేశం గురించి సమాచారం వుంది. విద్యుత్తరంగాల పరిశీలనకు బోసు పరికరం, ఒక సమావేశంలో ప్రదర్శింపబడింది. 1894 లో ప్రదర్శింపబడినటువంటి, ఒ. లాడ్జ్ పరికరాన్ని మార్చి చేసినటువంటిదిది. ఈ సమావేశంలో లాడ్జ్ వున్నారు; ప్రొఫెసర్ బోస్ పరికరం తన పరికరం కంటె ఎక్కువ యిమిడిక గలది, తక్కువ చపలతగలదీ అని ఆయనే అంగీకరించారు.*

జె. సి. బోస్ ప్రయోగాలు వైర్లెస్ టెలిగ్రాఫీ కనుగొనబడిన తరవాత, 1895 మే 7వ తేదీన రష్యన్ పదార్థ విజ్ఞాన-రసాయనిక సంఘానికి ఏ చరిత్రాత్మకమైన నివేదికను ఎ. పొపోవ్ సమర్పించిన పిమ్మట ప్రచురింపబడ్డాయి. కాని యీ భారతీయ విజ్ఞానశాస్త్ర వేత్త పేరు రేడియోకు ముందర చేయబడిన వైజ్ఞానికావిష్కరణ చరిత్రతో శాశ్వతంగా జోడింపబడివుంది; పొపోవ్ ఆయనను తనకు పూర్వపు విజ్ఞానశాస్త్రవేత్తగా ఎప్పుడూ పేర్కొంటూ వుండేవారు.

బోస్ పరిశోధన కృషిపట్ల రష్యన్ పత్రికలు ఎంతో శ్రద్ధను చూపాయి. 1897 జనవరి 4వ తేదీ సంచికలో, క్రోన్స్ తదత్‌లో ప్రచురింపబడే కోట్లిన్ అన్న వార్తాపత్రిక యిలా వ్రాసింది : "తాను నిర్మించిన సాధనాల సహాయంతో ప్రొఫెసర్ బోసు వెలుగు చొరని వస్తువుల (ఒపేక్ బోస్) ద్వారా 1500 మీటర్ల దూరానికి కాంతి సంకేతాలను ప్రసరింపజేయగలిగారు....విద్యుత్ కంపనాలను కాంతి ఆందోళనలుగా (ఆసిలేషన్స్) మార్చడం ద్వారా, విద్యుత్ తంత్రులను ఉపయోగించకుండా అనేకమైళ్ళ వ్యాసార్ధంలో సంకేతాలను పంపడం సాధ్యమవుతుంది; పొగమంచులో తరచుగా సంభవించే ప్రమాదాలను యిదేవిధంగా నిరోధించవచ్చును."

వృక్ష శరీరశాస్త్రంలో ప్రొఫెసర్ బోసు కృషి, యీ విధంగానే విజ్ఞానశాస్త్ర చరిత్రకు గొప్ప ప్రాధాన్యంగలది. తన రచనలలో, మహావైజ్ఞానిక శాస్త్రవేత్త తిమిర్యజేవ్, జె. సి. బోస్ కృషిని సవివరంగా సమీక్షించారు. తిమిర్యజేవ్ అభిప్రాయంలో బోసు కృషి "వృక్ష శరీర శాస్త్రాలలో సరియైన, పదార్థ విజ్ఞాన పద్ధతులను వినియోగించడంలో ఒక గణనీయమైన దృష్టాంతం". భారతీయ విజ్ఞానశాస్త్రవేత్త కృషి, విశిష్టతను తెలియజేస్తూ తిమిర్యజేవ్ యిలా వ్రాసేరు : "ఆయన పేరే, ప్రపంచ విజ్ఞానశాస్త్రాభివృద్ధిలో ఒక నూతన శకాన్ని స్థాపిస్తుంది."*

---

* ఎ. పొపోవ్‌చే రేడియో నిర్మాణం. పత్ర, సమాచార సంచయం సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు ప్రచురణాలయం యం. యల్ 1945, పుట 66.

* కె. ఏ. తిమిర్యజేవ్ రచనలు, సంపుటం 8. సెల్కోజ్‌గుయిజ్, 1939, పుట 178.



# భారత సోవియట్ దేశాల మైత్రీ సంబంధాలు

భారతీయ మహాకవి తులసీదాసు 426వ జన్మదినోత్సవ సందర్భంగా యిటీవల మాస్కోలో ఒక సభ జరిగింది. ఈ సభను విదేశాలతో సాంస్కృతిక సంబంధాల స్థాపనకు సంబంధించిన సోవియాట్ దేశ సంఘమూ, సోవియట్ రచయితల సంఘమూ, సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తుకు చెందిన ప్రాచ్య విద్యాధ్యయన సంస్థ ఏర్పరిచాయి. సభకు సోవియట్ సాహితీపరులూ భారతీయ విద్యాధ్యయనవేత్తలూ, మాస్కో ఉన్నత పాఠశాలల విద్యార్థులు, భారతీయ రాయబార కార్యాలయోద్యోగులూ హాజరయ్యారు.

సుప్రసిద్ధ సోవియట్ రచయిత అలెగ్జాండర్ చకోవస్కీ సభను ప్రారంభించారు. హిందీ సారస్వత సృష్టిలో తులసీదాసు గొప్ప పాత్ర గురించి ఆయన ప్రసంగించారు. సోవియట్ పాఠకులలో ఆయన రచనలపట్లగల గొప్ప మక్కువగురించి కూడా ఆయన చెప్పారు.

ప్రఖ్యాత సోవియట్ భారతీయ విద్యాధ్యయనవేత్త ఎవ్‌గెని చెల్మషెవ్, తులసీదాసు జీవితం గురించి, కృషి గురించి ఉపన్యసించారు. అకడిమీషియన్ బరన్నికోవ్ చేసిన అద్భుతమైన అనువాదం ద్వారా సోవియట్ పాఠకులకు లభించిన తులసీదాసు మహత్తర సృష్టి "రామ చరిత మానస" గురించి, ఆయన శ్రోతలకు తెలియజేశారు. తులసీదాసు గొప్ప రచయిత మాత్రమే కాకుండా, ఆయన గొప్ప మానవతగలవారనీ, తన రచనలలో ఆయన స్నేహం, శాంతి, సాంఘిక న్యాయాలను ఆకాంక్షించారనీ, యిది ముఖ్యంగా సోవియట్ ప్రజలు ఆయనను ప్రీతిపాత్రునిగా చేస్తున్నదనీ ఉపన్యాసకుడు చెప్పారు.

భారత రాయబార కార్యాలయ సలహాదారు శ్రీ రత్నం కూడా ఉపన్యసించి, భారతీయ ప్రజల సాంస్కృతిక సంపదపట్ల ప్రేమ కలిగివున్నందుకు కృతజ్ఞతను తెలియజేశారు.

తరవాత జరిగిన సంగీతసభలో సోవియట్, భారతీయ గాయకులు పాల్గొన్నారు. బొంబాయి లిటిల్ బాలె ట్రూపుకు చెందిన నర్తకుల ప్రదర్శనం ఘనవిజయాన్ని పొందింది. వారు "రామచరితమానస" ననుసరించి నృత్యాలు చేశారు.

## కొత్త హిందుస్తానీ పాఠ్య గ్రంథం

మాస్కో విదేశీ సారస్వత ప్రచురణాలయం హిందుస్తానీ వ్యాకరణం (హిందీ, ఉరుదూ) ద్వితీయ పరిష్కృత ముద్రణను ప్రచురించింది. గ్రంథకర్తలు, కీర్తిశేషుడైన సోవియట్ భారతీయ విద్యాధ్యయనవేత్త అకెడిమీషియన్ అలెక్సీ బరన్నికోవ్, ఆయన కుమారుడు పైలొట బరన్నికోవ్. సోవియట్ ఉన్నత విద్యా సంస్థలలో భారతీయ భాషలను చదివే విద్యార్థులకోసం, యీ పుస్తకం ఉద్దేశించబడింది.

★

సుప్రసిద్ధ సోవియట్ భారత విద్యాధ్యయన వేత్త ఇ. చెల్మషేవ్ తులసీదాస్ జీవితాన్ని కావ్య ప్రాశస్త్యాన్ని వివరిస్తోన్న దృశ్యం



సమావేశపు ఒక దృశ్యం



★ భారత



# యువజనులకు సోవియట్ యువజనుల అభినందనలు

**ఎస్. టి. హైదర్**

ఇటీవల లక్నోలో ఐదు రోజులు జరిగిన ద్వితీయ అఖిల భారత యువజన మహాసభా సమావేశానికి భారత దేశం అంతట్నుండీ సుమారు రెండు వేలమంది ప్రతినిధులు హాజరయ్యారు; సోవియట్ దేశం నుంచి యితర విదేశాలనుండీ సుమారు 300 మంది పరిశీలకులు వచ్చారు.

ఈ సమావేశానికి భారత ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ 1957 అక్టోబరు 27 న స్టేడియంలో ప్రారంభోత్సవం చేశారు.

సోమవారంనాడు, అక్టోబరు 28న, భారత యువజనులకు వారి కృషిలో విజయా కాంక్షలను పరిశీలకులు, యువజన మహాసభా సమావేశంలో అందజేశారు.

సోవియట్ పరిశీలకుల దళం నాయకుడు యం. వ్లాదిమిర్ పొపోవ్ భారత దేశానికున్నది ప్రాచీన సంస్కృతి, అందమైన వాస్తుశిల్పమూ, కమ్మని సంగీతమూ మాత్రమే కాదు, అది భూత కాలపు అందచందాలను నవ జగత్తు నిర్మాణంతో పెనవేస్తూ సాగిపోతున్నదని అన్నారు; ఇది సోవియట్ దేశ ప్రజల ప్రేమ, ప్రశంస, స్నేహాలను భారతీయులకు చేకూర్చిందని ఆయన చెప్పారు.

వలస విధానానికి వ్యతిరేకంగా భారతీయులు సాగించిన మహా సమరం పట్ల తన ప్రశంసాభావాన్ని వ్యక్తపరుస్తూ ఆయన, సోవియట్ ప్రజలు, ముఖ్యంగా యువజనులు గోవా కూడా స్వాతంత్ర్యాన్ని సాధించుకుంటే ఆనందిస్తారన్నారు.

సోవియట్ పరిశీలకుల దళం, యువజన మహాసభా సమావేశం అధ్యక్షునికి సుందరాలంకృతమైన ఒక పాత్రను బహూకరించింది.

★



పైది, పైన : యువజన కాంగ్రెస్ సమావేశానికి విచ్చేసిన సోవియట్ పరిశీలకులు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూతో—(ఎడమనుండి) మిఖైల్ ట్రావిషెవ్, వ్లాదిమిర్ పొపోవ్ (నాయకుడు) శ్రీ నెహ్రూ, అలియా మజిదోవా.

**1957** ఫిబ్రవరి మాసంలో మాస్కో విశ్వవిద్యాలయానికి చెందిన ప్రాచ్య భాషల విద్యాసంస్థ ప్రొఫెసర్ అయిన ప్రముఖ సోవియట్ భారత విద్యాధ్యయనవేత్త ఎ. ఎమ్. ద్యాకోవ్, లెనిన్‌గ్రాడ్ లోని నర పరిశీలన శాస్త్ర విద్యాసంస్థకు చెందిన మిఖైల్ ఇంద్రియవత్సేవ్‌తోను, సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు ప్రాచ్య విద్యా సంస్థకు చెందిన ఇ. ఎమ్. బ్యాకోవాతోను కలసి ఒరిస్సాను సందర్శించారు. ఒరిస్సా దేశపు మహత్తర ప్రాచీన కళలను, సంస్కృతిని చూచి వారు ముగ్ధులయ్యారు. అవసరమైన పుస్తకాలు మొదలైనవి లభించినట్లయితే, సోవియట్ దేశ విద్యా సంస్థలలోను, పరిషత్తుల లోను ఒరియా భాషాధ్యయనం ప్రవేశ పెట్టబడడానికి అవకాశ



సోవియట్ దేశ రాయబార కార్యాలయ ప్రథమ కార్యదర్శి శ్రీ మొస్కలెవ్ బహుమతుల స్వీకరిస్తోన్న దృశ్యం.

★

మున్నదని వారు ముఖ్యమంత్రి శ్రీ హరేకృష్ణ మెహతాబ్‌కు సూచించారు.

సోవియట్ దేశపు భారత విద్యాధ్యయన వేత్తల కోర్కె ననుసరించి, కొన్ని తాళపత్ర గ్రంథాలతో సహా అనేక ప్రాచీన ఆధునిక ఒరియా గ్రంథాలు సెప్టెంబరు మాసంలో ఉచితమైన రీతిని ఒక సభలో ఒరిస్సా శాసనసభాధ్యక్షుడు పండిత నీలకంఠదాసుచే సోవియట్ దేశపు భారత విద్యాధ్యయన వేత్తలకు బహూకరింపబడ్డాయి. వాటిని సోవియట్ దేశపు భారత విద్యాధ్యయనవేత్తల పక్షున, భారత దేశంలోని సోవియట్ దేశ రాయబార కార్యాలయపు ప్రథమ కార్యదర్శి మొస్కలోవ్ స్వీకరించారు.

ఈ గ్రంథ బహూకరణ సందర్భంలో జరిగిన సభలో ఒరిస్సా ముఖ్యమంత్రి శ్రీ హరేకృష్ణ మెహతాబ్, ప్రఖ్యాత ఒరియా నవలాకారుడు శ్రీ గోపీనాథ్ మహంతి, ఒరియాభాష, సాహిత్యాల ప్రొఫె

(మిగత 33వ పుటలో)







# బాల ప్ర



పిల్లలకోసరం కొత్తగా కట్టిన డిపార్టుమెంటు దుకాణం, "పిల్లల ప్రపంచం". ఇది ఆకారంలో కూడా ఒకవిధంగా అసాధారణమైన దుకాణం.

ఇదొక కొత్త కట్టడంలో వుంది. ఈ కట్టడం మాస్కో మధ్యవీధులొకదానిలో ఒక బ్లాకుకుపైగా వ్యాపించివుంది.

ఈ ఇంటిలోపల చక్కగా అలంకరించివుంది. కుడ్యాలకు ఆకర్షణీయమైన లేత రంగులు పూసివున్నాయి. కౌంటర్లు, కిటికీలూ స్టెయిన్‌లెస్‌స్టీలుతోనూ, గాజు, పాలిష్‌చేసిన ప్లాస్టిక్స్‌తోనూ తయారు

---

బాలలకు అత్యంత ఆహ్లాదకరమైన మందిర ప్రాంగణం, దీనినిండా ఇటువంటి చక్కటి బొమ్మల్ను గుట్టలు గుట్టలున్నాయి: (పైన)

"చక్కటి ఈ తెల్ల గుర్రాన్ని మనం కొనుక్కోకూడదూ ?"అని అడుగుతోన్న భారత రాయబార కార్యాలయోద్యోగిని (కుడిపైన)

రబ్బర్ టైర్లతోవున్న చూడ ముచ్చటైన ఎర్ర బైసికల్ వోపాకు ఎంతో ప్రీతిపాత్రమైంది. వచ్చినచిక్కల్లా ఆ పాపకు ఇంకా పెడల్సు అందటంలేదు. ఇంకో ఏడాది గడిస్తేనేగాని కాళ్ళందవన్న సంగతి ఆ పాపకు చెప్పి ఒప్పించడం తల్లికి అంత సులభమైన విషయంకాదు (దిగువ)

ఆ గుర్రంమీద నైజు తొక్కకపోయినట్టు పోవచ్చు. కొనుగోలు దారులైన ఈ బాలలంతా అదంటే ఎంతో ముచ్చటపడుతున్నారు (పైన మధ్య)









ఎ. కొరొతోవా

చేయబడినవి.

అన్నిటికంటె ముఖ్యవిషయం, యీ దుకాణంలో పిల్లలకు శైశవంనుండి 17 ఏళ్ళ ప్రాయంవరకూ కొనవలసిన వాటినన్నిటినీ ఎవరైనా కొనవచ్చును. లేసులు ఎంబ్రాయిడరీ కుట్టిన నాజూకైన బట్టలు, చిన్నపక్కలు, పిల్లల తోపుడుబళ్ళు, స్నానం టబ్బులు, చిన్న చిన్న మెత్తని జోళ్ళు, బొమ్మలూ వుంటాయి.

ప్రాకుతున్న వాళ్ళకోసమూ, తప్పటడుగులు వేస్తున్నవారి కోసమూ అందమైన బుల్లిదుస్తులూ, పిల్లల పడకగదులకు సామాన్లు, ప్రత్యేకమైన పాత్రలు, యంత్రపు ఆటవస్తువులు, అమ్మ-బొమ్మలు, మిలమిల మెరిసే మూడుచక్రాల సైకిళ్ళు వున్నాయి. ఈ సైకిళ్ళను అవసరమైనప్పుడు తేలికగా రెండు చక్రాల సైకిళ్ళుగా మార్చి వెయ్యవచ్చును.

ఈ దుకాణంలో బడిపిల్లలకు ప్రతిఒక్కటీ దొరుకుతుంది—నోటుపుస్తకాలనుండి, యూనిఫారాలవరకూ. బడికివెళ్ళని వయసులో వున్న పిల్లలందరి స్వప్నం యిదేగదా.

పిల్లలకు బాగా యిష్టమైన శాఖలు ఫోటోగ్రాఫ్, రేడియో వస్తువులను అమ్మేశాఖలూ, "సమర్థమైన హస్తాలు" అనబడే కళల శాఖ, "యువప్రకృతీ ప్రేమికుల"శాఖ. ఇవి తక్కువ ధరలకు కెమేరాలు, రేడియోలూ, బిల్డర్స్ సెట్టులూ, వడ్రం, యంత్రపరికరాలూ, మేగ్నెతోఫోన్ లేదా ఎలెక్ట్రిక్ గ్రామొఫోన్‌లను అమర్చడానికి అవసరమయ్యే విడిభాగాలను కూడాతక్కువధరలకు అమ్ముతాయి.

"పిల్లల ప్రపంచం" నిజంగా క్లిష్టమైన చాలా గొప్ప ప్రపంచం. ప్రతిచోటా యంత్రాలు అమ్మబడుతూవున్నప్పటికీ, యీ దుకాణంలో మూడు వేలమందికి పైగా పనివారున్నారు. వారిలో అమ్మకం చేసే గుమాస్తాలే 1,300 మంది ఉన్నారు.

ఈ ఏడే పెత్యా మొట్టమొదటిసారిగా పాఠశాలకు వెళ్ళాడు. అప్పటికే "స్వంతంత్రుడై" తనకు తానే కాపీ పుస్తకాలు, పెన్సిళ్ళు కొనుక్కొని వర్ణచిత్రాలు లిఖిస్తున్నాడు (పైన ఎడమ)

★

ఈ పసివాడి కళ్ళు ఎలా మిలమిల్లాడుతున్నాయో చూడు! తండ్రితోపాటు చేపలపట్టే గాలం కొనుక్కోడానికి వచ్చాడు (కుడిపైన)

★

ఆ చిన్నది గాల్యాకు ఇంకా రెండేళ్ళన్నా నిండలేదు. కొట్టుకురావడం కూడా ఇదే మొట్టమొదటిసారి. అయిదోసారి దుస్తులు ధరించి చూచుకొని అది నచ్చక, ఇంకా కొత్తరకాలు చూపించమని అడుగుతున్నది! (కుడి దిగువ)









←కాత్యాకు బాగా బొచ్చుతోవున్న ఎలుగుబంటి బొమ్మ వున్నది. దాన్ని బాగా మేపాలి



చెప్పులను రేసువేసుకోవడం అంత సులభమైన పనికాదు! →

★

మాస్కో బాలలు, ఇటువంటి చక్కటి విక్రయశాలల ప్రదర్శన విభాగాలను చూడకుండా ఎట్లా విడిచిపెట్ట గలుగుతారు! ↓

మాస్కోలో నిర్మితమైన బాలల నూతన విక్రయశాల విభాగం, వీధిలోనుంచి చూస్తే ఇట్లా కనిపిస్తుంది

★

రోజుకు లక్షల మందికి పైగా బేరగాళ్ళను ఆకర్షించే దుకాణానికిది సహజమే.

కొత్తశాఖలూ, పిల్లలకు క్షవురశాల, ఫాషన్ ప్రదర్శనమూ, ఫోటోగ్రాఫీ హాలు వుండబోయే పక్షం, యింకా నిర్మాణంలో వుంది. ఇది పూర్తిఅయ్యేక "పిల్లల ప్రపంచం", సోవియట్ దేశంలోని పెద్ద దుకాణాలలో ఒకటవుతుంది.



★

బాలల విక్రయశాల నూతన విభాగంలోని స్వయంచోదక ప్రత్యేకయంత్రం. ఒకమీటరును నొక్కితే, ఒక్క సెకండులో కమ్మటి ఎడు కలాన్ వాసన ఘుమఘుమలాడుతూ నిన్నుముంచెత్తుతుంది. అప్పుడే నువ్వు మంగలిషాపునుంచి ముస్తాబైవచ్చినట్టు





టాన్యాకు దానంత బొమ్మవుంది, ఇప్పుడు దాన్ని ఈ కొత్తబండిలో పెట్టి తోడ్చుకెళ్ళాలి →





లెనిన్‌గ్రాడ్, స్టాలిన్ ఎవెన్యూవద్ద 64, 65 నెంబర్ల బ్లాకుల గృహనిర్మాణ దృశ్యం

*అక్టోబరు విప్లవం జరిగినప్పట్నుండీ సోవియట్ దేశ అభివృద్ధి ప్రగతిగురించి యిది చివరి వ్యాసం. మొదటి నాలుగు వ్యాసాలూ 'సోవియట్ భూమి' 16, 18, 19, 20 సంచికలలో ప్రచురింపబడ్డాయి–సం.*

## నూతన దశలో ప్రవేశం

ఎల్. పాపిన్ ఎం.ఎస్‌సి(చరిత్ర)

ద్వితీయ ప్రపంచ మహాయుద్ధం ఫాసిజం ఓటమితో సమాప్తమయ్యింది. సామ్రాజ్యవాద ప్రపంచ "జోస్యులు", సామ్యవాద భూమిని ద్వేషిస్తూ, సోవియట్ దేశం యుద్ధ వినాశనంనుండి కోలుకోవడానికి యిరవై ముప్పయ్యేళ్ళు పడుతుందని వాదించారు. కాని సామ్యవాద వ్యవస్థకుగల శక్తుల గురించి, అవకాశాల గురించిస్థ ఊహోహలపై ఆధారపడినవారి తప్పుడు అంచనాలు మళ్ళీ విఫలమయ్యాయి. 1946లో సోవియట్ ప్రజలు తమ నాల్గవ పంచవర్ష ప్రణాళికను — యుద్ధానంతరం యిది మొదటిది — నెరవేర్చడం మొదలు పెట్టారు; దీని అత్యంత ముఖ్యకర్తవ్యం, యుద్ధ ఫలితంగా నాశనమైన దేశ ఆర్థిక పునరుద్ధరణ. మహత్తరమైన ఏక కుటుంబంగా సోవియట్ దేశ శ్రామిక ప్రజలు యీ కఠినమైన కర్తవ్యాన్ని నెరవేర్చారు. పూర్వం యుద్ధానికి సంబంధించిన ఉత్పత్తిని చేసే చాలా పరిశ్రమలు, శాంతికాల అవసరాలకు వస్తువులను తయారు చెయడం మొదలుపెట్టాయి. ఫాసిస్టు దురాక్రమణదారులు దేశపు దుక్కయినుము, ఉక్కు అవసరాలలో సగభాగానికి పైగా ఉత్పత్తి చేస్తూవుండిన 37 పెద్ద లోహ పరిశ్రమలను నాశనం చేశారు. ఈ పరిశ్రమలన్నీ కోలుకోవడం మాత్రమే కాకుండా, సరికొత్త యంత్ర సామగ్రి నెలకొల్పబడేటట్టుగా పునర్నిర్మింపబడ్డాయికూడా. ఇప్పుడవి పూర్వంకంటె చాలా ఎక్కువగా లోహాన్ని తయారు చేస్తున్నాయి. స్టాలిన్‌గ్రాడ్ పరిశ్రమలు, క్రూరంగా నాశనం గావింపబడిన నగరాల పరిశ్రమలూ మళ్ళీ పని చేస్తున్నాయి. యుద్ధం ముగిశాక ఐదేళ్ళు మాత్రమే గడిచిన తరవాత, సోవియట్ దేశ పరిశ్రమలు యుద్ధాత్పూర్వ ఉత్పత్తిస్థాయిని చేరడం మాత్రమే కాకుండా, దానిని బాగా మించిపోయాయి కూడా. 1947లో సమిష్టిక్షేత్రాలు, యుద్ధ ప్రారంభంలో ప్రవేశపెట్టబడిన ఆహారపదార్థాల, వస్తువుల రేషనింగును రద్దు చేయడానికి వీలయినంత యెక్కువ మొత్తాలలో ధాన్యాన్ని వ్యావసాయక వస్తువులను ఉత్పత్తి చేశాయి. తరవాత సంవత్సరాలలో క్రమక్రమంగా వినియోగ వస్తువుల ధరలు తగింపబడ్డాయి. గృహనిర్మాణం త్వరితగతిని పెంపొందింది. 1946-1950 మధ్యకాలంలో ఒక్క గ్రామసీమలోనే 2,700,000 నివాస గృహాలు పునర్నిర్మింపబడడమో, కొత్తగా కట్టడమో జరిగింది.

సోవియట్ ప్రజలు ఆత్మ విశ్వాసంతో, యితోధిక సంస్కృతీ ఆర్థిక వికాసానికి, జీవన ప్రమాణాల అధికతర అభివృద్ధికి తాము సాగించే పురోగమనంలో వేగాన్ని సాధించారు.

## పెద్ద అభివృద్ధి

సోవియట్ ప్రజలిప్పుడు, యుద్ధానంతరం మూడవ పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా పూర్తి చేస్తున్నారు. గడిచిన కాలంలో సోవియట్ దేశం సాధించిన విజయాలేమిటి?

గత ఏడాది దేశపు పెద్ద పరిశ్రమ జారిస్టు రష్యాయొక్క

అత్యున్నత ఉత్పత్తిస్థాయిని 30 రెట్లకుపైగా మించింది; దేశపు భారీ పరిశ్రమ ఆ స్థాయికి 50 రెట్లకుపైగా మించింది. ప్రత్యేకంగా యంత్ర నిర్మాణం, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి యెక్కువ త్వరితగతిని పెంపొందాయి. యంత్రాల తయారీ, విప్లవానికి పూర్వపు స్థాయితో పోల్చినట్లయితే, 180 రెట్లు హెచ్చింది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ఇంచుమించుగా నూరురెట్లు పెరిగింది. దుక్కు యినుము, ఉక్కు కరిగించడం, బొగ్గుతీత, యింకా అనేకరకాల పారిశ్రామిక వస్తువుల ఉత్పత్తి విషయంలో సోవియట్ దేశం యూరప్‌లోని పెద్ద పెట్టుబడిదారీ దేశాలను బాగా మించిపోయి, ప్రపంచానికి రెండవస్థానాన్ని సంపాదించింది. ఉదాహరణకు 1955 లో సోవియట్ దేశం 45.3 మిలియన్ల టన్నుల ఉక్కును ఉత్పత్తిచేస్తే, బ్రిటను, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ కలసి 54 మిలియను టన్నులు ఉత్పత్తి చేశాయి. రెండు దశాబ్దాల క్రితం మాత్రమే యీ దేశాలు సోవియట్ దేశానికి రెట్టింపు ఉక్కును తయారు చేస్తూవుండేవి।

సోవియట్ దేశం అంతటా నిర్మాణస్థలాల వరంజాలు కనిపిస్తాయి. నీపిర్‌నుండి సైబీరియా మహానది అంగారా వరకూ దాని పెద్ద నదుల వెంబడిని మహత్తరమైన విద్యుత్కేంద్రాల నిర్మాణం సాగుతూ వుంది. ఉదాహరణకు బ్రత్‌స్క్ విద్యుత్కేంద్రం, 1932 లో నిర్మింపబడిన నీపిర్ విద్యుత్కేంద్రంకంటె — అప్పుడిది యూరప్ అంతటికీ పెద్ద జల విద్యుత్కేంద్రం — ఆరున్నర రెట్లు యెక్కువ విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తుంది. కొత్త పరిశ్రమలు, ఫాక్టరీలు, బొగ్గు, ముడి లోహాల గనులను నడపడంలో సోవియట్ కార్మికుల, ఇంజినీర్ల, సాంకేతిక విషయజ్ఞుల నూతన విజయాల సంతోష వార్తలు ప్రతిరోజూ వస్తుంటాయి.

సోవియట్ రైతులుకూడా యిటీవల సంవత్సరాలలో ఘన విజయాలను సాధించారు. 1954 లో, సైబీరియాలోనూ, కజకస్తాన్లోనూ, ఓల్గా ప్రాంతపు మండలాలలోనూ, ఉత్తర కకాసస్‌లోనూ, దేశపు యితర భాగాలలోనూ బీళ్ళ సేద్యం మొదలైంది. మూప్ఫయి లక్షల ఏభై వేలమంది యువతీయువకులు సోవియట్ దేశం అన్ని భాగాలనుండీ బీళ్ళను దున్నడానికి వెళ్ళారు. వారి సహాయానికి దేశం రెండు లక్షలకు పైగా ట్రాక్టర్లనూ, యితర యంత్రాలను పంపింది. అహోరాత్రాలు పని సాగింది. బీళ్ళను జయించిన వారిశ్రమ, వ్యవసాయాభివృద్ధికి ఉద్దేశింపబడిన యితర చర్యలు అమలు జరగడమూ సోవియట్ దేశానికి 1956 లో ఎటువంటి పంట నిచ్చిందంటే, దేశం అటువంటి పంటను ఎన్నడూ కనీవినీ ఎరుగదు।

పశు పోషణలోకూడా సోవియట్ ప్రజలు సాధించిన విజయాలు చాలా గొప్పవి. వ్యవసాయంలో విజయాలను సాధించడం వల్ల, పార్టీ, ప్రభుత్వమూ మాంసం, పాలు, వెన్న తల ఒక్కంటికీ ఉత్పత్తిలో అమెరికాను అతిత్వరలో అందుకోవలసిన కర్తవ్యాన్ని సోవియట్ రైతులకు విధించడానికి అవకాశం కలిగింది. ఈ కర్తవ్య నిర్వహణకు సోవియట్ ప్రజలకు అవకాశాలన్నీ వున్నాయి; వారిప్పటికే తొలి విజయాలను సాధించారు.

గృహనిర్మాణంపట్ల దేశం గొప్పగా శ్రద్ధను తీసుకుంటోంది. ముప్పయ్యేళ్ళయ్యేలోపుగా సోవియట్ దేశంలో రెండువేల కొత్త నగరాలు, కార్మికుల చిన్న నగరాలు వెలిశాయి. నగరాల్లో ప్రస్తుతం రోజూ రెండువేల కుటుంబాలు, అన్ని వసతులూ గల కొత్తయిళ్ళలోనికి వెళ్తున్నాయి; ప్రతిరోజూ వెయ్యి సమిష్టి కర్షక కుటుంబాలకు కొత్త యిళ్ళు వస్తున్నాయి. దీనితోబాటుగా పెద్ద పెట్టున పాఠశాలలు, వైద్యశాలలూ, హోటళ్ళు, క్లబ్బులు, శిశు పోషణాలయాలూ నిర్మింపబడుతున్నాయి. అయినా త్వరితగతిలో జనాభా వృద్ధి చెందడమూ, పరిశ్రమలు వేగంగా పెంపొందడమూ వల్ల, గృహనిర్మాణస్థాయి నిరంతరం పెరుగుతూ వున్నప్పటికీ పట్టణాలలోనూ, నగరాలలోనూ, గ్రామాలలోనూ ప్రజలు యింకా మంచి యిళ్ళ కొరతను అనుభవిస్తూనే వున్నారు. ఇటీవల సోవియట్ ప్రభుత్వం గృహనిర్మాణాభివృద్ధి గురించి ఒక ప్రత్యేక నిర్ణయం చేసింది. రానున్న పది, పన్నెండేళ్ళలో దేశంలో యిళ్ళ కొరత రద్దుచేయబడుతుంది. ఈ ఐదేళ్ళకాలంలోనే 215 మిలియన్ల చదరపు మీటర్ల మొత్తం నివాస స్థలంలో యిళ్ళు నిర్మింపబడుతున్నాయి; మొదట ఉద్దేశింపబడిన దానికంటె యిది పది మిలియన్ల చదరపు మీటర్లు ఎక్కువ. ఇంకొన్నాళ్ళకు సోవియట్ ప్రజలందరూ మంచి పరిస్థితులలో జీవిస్తారు.

## సామ్యవాద సంస్కృతీ వికసనం

ఫాసిస్టు దురాక్రమణదారులు సోవియట్ దేశంలో 82 వేల పాఠశాలలను కాల్చి నాశనం చేశారు. 1946-1956 మధ్య పాఠశాలలను పునర్నిర్మించడమేకాకుండా, 30 వేల కొత్త పాఠశాలలు నిర్మింపబడ్డాయి. చదువుకోవడానికి పిల్లలందరికీ అవకాశం కల్పింపబడింది. గత ఐదేళ్ళ కాలంలో గ్రామాల్లో సర్వజనీన సప్తవర్ష విద్య, పట్టణాలలో దశవర్ష విద్య ప్రవేశపెట్టబడింది. ఇప్పటి పంచవర్ష దశలో సర్వజనీన దశవర్ష విద్యను ప్రవేశపెట్టాలనే సోవియట్ దెశ కమ్యూనిస్టుపార్టీ యిరవైయ్యవ మహాసభ నిర్దేశించిన కొత్త కర్తవ్యం యిప్పుడుంది.

ఎంతోమంది కార్మికులు, కర్షకులు, ఉద్యోగులు వివిధ

కోర్సులనూ తమ విద్యను పెంపొందించుకుంటున్నారు. దేశపు కళాశాలలలోనూ, సాంకేతిక పాఠశాలలలోనూ సాయంకాల విద్యా శాఖలు, ఉత్తర ప్రత్యుత్తర విద్యాశాఖలూ వారికున్నాయి.

ఏడాదికేడాది కళాశాలల సంఖ్య హెచ్చుతుంది. 1955లో పద్దెనిమిది లక్షల మందికి పైగా శిక్షణనిచ్చే 765 కళాశాలలు సోవియట్ దేశానికి ఉన్నాయి. ఇది ద్వితీయ ప్రపంచ యుద్ధానికి పూర్వంకంటె రెండింతలు. స్వంత విశ్వవిద్యాలయమూ, కళాశాలలూ లేని ఒక్క యూనియన్ రిపబ్లిక్కు కూడా యిప్పుడు దేశంలో లేదు. 1952లో సోవియట్ దేశంలోని విద్యార్థులలో నూటికి 52 వంతులు స్త్రీలు. ఇంత పెద్ద శాతంలో విద్యార్థినులు ప్రపంచంలో యింకేదేశాలలోనూ లేరు.

జాతుల రిపబ్లిక్కుల ప్రజలుకూడా సంస్కృతీవికసనంలో అద్భుతమైన విజయాలను సాధించారు.

తజిక్ సోవియట్ సామ్యవాద రిపబ్లిక్ విద్యాశాఖ మంత్రి 1916లో జారీచేసిన మొదటి ఆజ్ఞలో యిలా వుంది : "ప్రజా విద్యా రంగంలో పనిచేసేవారిని, ఉపాధ్యాయులను, పాఠశాలల ఉద్యోగులను నమోదు చేయడం—మొత్తం 31 మంది, 4 బోర్డింగ్ పాఠశాలలు, 3 ప్రాథమిక పాఠశాలలు 152 మంది విద్యార్థులతో." 1956-1957 పాఠశాలా సంవత్సరంలో తజిక్ రిపబ్లిక్కులో రెండున్నర వేలకు పైగా పాఠశాలలున్నాయి, వాటికి 320,000 మంది విద్యార్థులు వెళ్తుండేవారు. విప్లవానికి ముందర ఉజ్బెకిస్తాన్‌ను ఒక్క ఉజ్బెక్ ఇంజినీరుకూడా లేడు. కాని 1956లో యీ రిపబ్లిక్కుకు కళాశాల, సెకండరీ విద్య పొందిన 125,000 మంది ప్రవీణులున్నారు, వారిలో చాలామంది యింజినీర్లు.

సోవియట్ వైజ్ఞానిక, సాంకేతిక రంగాలలో మేధావులైన వారిసంఖ్య త్వరత్వరగా పెరుగుతూ వుండడం, సోవియట్ వైజ్ఞానికాభివృద్ధికి దోహదకారి అయ్యింది. విజ్ఞానశాస్త్రంలో క్రొత్తగా కనుగొన్నవీ, కల్పించినవీ చాలా వాటిలో ముందడుగు సోవియట్ విజ్ఞానశాస్త్రజ్ఞులదీ, ఇంజినీర్లదీ. సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు సాధించిన విజయాలు ఒక్క సోవియట్ దేశంలో మాత్రమే కాకుండా, యితర దేశాలలో కూడా పరిశ్రమలోనూ, వ్యవసాయంలోనూ పలువిధాలుగా ఉపయోగింపబడుతున్నాయి.

సోవియట్ పరిశ్రమలు తయారుచేయలేని అనేకరకాల యంత్ర పరికరాలనూ, మెకానిజమ్స్‌నూ సోవియట్ దేశం విదేశాలనుండి దిగుమతి చేసుకోవలసిన కాలం ఎప్పుడో గతించి పోయిందని సోవియట్ ప్రజలు భావిస్తుండేవారు. కాని యిది 25-30 ఏళ్ళక్రితపు మాట. ఇప్పుడు సోవియట్ దేశం అన్నిరకాల అధునాతన పారిశ్రామిక యంత్రసామగ్రిని తయారు చేస్తోంది; సాలుకు సుమారు 700-900 క్రొత్తరకాల యంత్రాలు, మెకానిజమ్స్ తయారవుతున్నాయి. వాటిలో శక్తివంతమైన గొప్ప యంత్ర పరికరాలూ, పూర్తిగా స్వయం చలిత ఉత్పత్తి సాధనాలూ, ప్రపంచం అంతటికి ఉత్తమమైన టర్బో-డ్రిల్లులు, వైజ్ఞానిక పరిశోధనకు వివిధ పరికరాలు వున్నాయి. శక్తివంతమైన లారీలు, శీఘ్రగతిలో పోయే సదుపాయమైన విమానాలూ సోవియట్ పరిశ్రమలలో నిర్మింపబడుతున్నాయి.

*    *    *

దేశాల జీవితంలో నలభైయ్యేళ్ళు అల్పకాలం మాత్రమే. కాని చారిత్రికంగా అల్పమైన యీ కాలంలో సోవియట్ దేశం మహత్తరమైన యశోపథాన్ని గడిచింది. వెనుకబడిన పాత రష్యా స్థానంలో, పెంపొందిన ఆర్థికవిధానం, సంస్కృతిగల గొప్ప శ్రామికప్రజల సామ్యవాద దేశం వెలిసింది. సామ్యవాద వ్యవస్థకుగల అవకాశాలు అపారమైనవి, దాని లాభాలు సుస్పష్టమైనవి గనుక, పెట్టుబడిదారీ దేశాలతో శాంతియుతమైన ఆర్థిక పోటీలో తాము జయిస్తామని సోవియట్ ప్రజలు దృఢవిశ్వాసంతో వున్నారు.

## లెనిన్ గోపాల్



మహత్తర అక్టోబరు విప్లవం 40వ వార్షికోత్సవ సందర్భాన, ప్రియతమనాయకుడు వి.ఐ. లెనిన్ పట్ల తన గాఢమైన గౌరవాన్ని వ్యక్తపరచడానికీ, భారత-సోవియట్ మైత్రికి, సకల దేశాలలో శాంతికీ చిహ్నంగానూ తన ఆరుమాసాల కుమారునికి "లెనిన్ గోపాల్" అని నామకరణం చేశానని తెలియజేస్తూ, మద్రాసు పురవాసి శ్రీ యన్. వెంకటరామన్ నుండి "సోవియట్ భూమి" సంపాదక వర్గానికి ఒక లేఖ వచ్చింది.

# సోవియట్ దేశంలో సనాతన చర్చి

(ఆస్తిక పరిషత్తు రెక్టర్ అయిన కాన్‌స్తాంతిన్ రుజిత్స్కీతో జరిపిన ఇంటర్వ్యూ)

కె. సి. శేఖర్

*మా పత్రిక పాఠకులు చాలా మంది సోవియట్ దేశంలో మతం విషయాన్ని గురించి అడుగుతుంటారు. ఆ ప్రశ్నకు సమాధానంగా మేము, సోవియట్ దేశంలో సనాతన చర్చిని గురించి శ్రీ కె. సి. శేఖర్ ఆస్తిక పరిషత్తు రెక్టర్ అయిన కాన్‌స్తాంతిన్ రుజిత్స్కీతో జరిపిన ఇంటర్‌వ్యూను ప్రకటిస్తున్నాము.*



ఆర్చిబిషప్ కాన్‌స్తాంతిన్ రుజిత్స్కీ మా విలేఖరితో సంభాషిస్తూ

★

విప్లవానంతరం రష్యాలో (ఇంకా సరిగ్గా చెప్పాలంటే సోవియట్ దేశంలో) మతాన్ని గురించి ఎప్పుడు తలుచుకొన్నా నాకు గోల్డ్ స్మిత్ కవి యొక్క "పాడుపడిన గ్రామం" చిత్రం నా స్మృతిపథంలోకి వస్తుండేది: అక్కడ చర్చిలు శిథిలమైపోయి, ధూళిదూసరితమై ఉంటాయనీ, ఒకప్పుడు సౌభాగ్యానికి ఆలవాలంగా ఉంటూవచ్చిన ఆ చర్చిలలోని మతగురువులు చినిగిపోయిన గుడ్డలతో కనబడుతారనీ, కొత్తరాజకీయ వ్యవస్థ చర్చిలను గురించి పట్టించుకోరనీ, కమ్యూనిస్టు ప్రభుత్వం చర్చిని నిరసిస్తుంది గాబట్టి మతంలో సమ్మకం ఉన్నవాళ్లు గూడా ఆ ఛాయలకు రారనీ అనుకొంటుండేవాడిని. భారత దేశములో ఉన్న మనకు, అక్కడి వాస్తవ పరిస్థితులు యేమీ తెలియవనే చెప్పాలి. కొన్ని వర్గాల దురుద్దేశపూరితమైన ప్రచారం ఆ పరిస్థితులను తప్పుగా చిత్రించడం కూడా దీనికి కొంత కారణం.

అందువల్ల, సహజంగానే, ఆస్తిక పరిషత్తు రెక్టర్ కాన్‌స్తాంతిన్ రుజిత్స్కీ, తనను కలుసుకొని మాట్లాడడానికీ, స్వయంగా అక్కడి పరిస్థితులు నేను చూచి తెలుసుకొనడానికీ అంగీకరించారనగానే నా ఉత్సాహానికి మేరలేకపోయింది. నాలోగల సత్యాన్వేషణాభిలాష నన్ను మాస్కోకు సమీపంలోవున్న జొగోర్స్క్ పట్టణానికి తీసుకువెళ్ళింది. అక్కడ చర్చిలు చాలా ఉన్నాయి.

ఆ పట్టణాన్ని చూడాలని యెంతో కుతూహలపడుతూ ఉండిన నేను, రెండు గంటల ప్రయాణం తర్వాత అక్కడికి చేరుకొన్నాను. రెక్టర్ నాకు చాలా ఆదరంతో స్వాగత మొసగారు. అటుతర్వాత హృదయాలు విప్పి ఒకరితోనొకరు మాట్లాడుకొన్నాము. బహుశ నేను చీకాకును కలుగజేసే కొన్ని సూటియైన ప్రశ్నలను వేసినట్లున్నాను. రెక్టర్ వాటి కన్నిటికీ యెంతో సహనంతో జవాబులు యిచ్చినందుకు వారికి నేను కృతజ్ఞతను తెలుపవలసివుంటుంది.

అక్టోబరు సోషలిస్టు విప్లవానికి పూర్వం రష్యన్ సనాతన చర్చి, వివిధ క్రిస్టియన్ చర్చిలలోనేగాక, మొత్తంగా అన్ని మతాలలో గూడా విశిష్టస్థానాన్ని కలిగివుండేది. రష్యన్ సనాతన చర్చి "రాజులను గద్దె ఎక్కించగల" తాహతును కలిగివుండేదంటే అతిశయోక్తి కానేరదు. రాజకీయ, ఆర్థిక విషయాలలోను, ప్రజల దైనందిన జీవితానికి సంబంధించిన యితర విషయాలలోను దానికి గట్టి పలుకుబడి ఉండేది. రష్యన్ సనాతన చర్చి తనకున్న ప్రత్యేక సౌకర్యాలను వినియోగించుకొని ఇతర క్రిస్టియన్ శాఖలను, మతాలను అణిచివేస్తుండేది. ఒకప్పుడు మాస్కో విశ్వవిద్యాలయంలోగాని, లెనిన్‌గ్రాడ్ (సెయింట్ పీటర్స్‌బర్గ్) విశ్వవిద్యాలయంలో గాని ప్రవేశం కావాలన్నా, ప్రభుత్వోద్యోగం కావాలన్నా క్రిస్టియన్ మతాన్ని — అందులోను సనాతన క్రిస్టియన్ మతాన్ని — స్వీకరింపవలసి వస్తుండేది. దీనినిబట్టే రష్యన్ సనాతన చర్చి యెంతటి గట్టి పలుకుబడిని కలిగిఉండేదో మీరు గ్రహింపవచ్చును.

విప్లవం తర్వాత మతం, ఆరాధనల విషయంలో ఇవ్వబడిన స్వాతంత్ర్యాన్ని గురించి తెలుసుకోవాలని నాకు సహజంగానే కుతూహలం కలిగింది.

## విప్లవం తర్వాత చర్చి పరిస్థితి

విప్లవం జరిగినవెంటనే లెనిన్ స్వయంగా సిద్ధంచేసిన "మతం, ఆరాధనల స్వాతంత్ర్య విషయిక ప్రభుత్వ ప్రకటన" ప్రకటింపబడిందని రెక్టర్ తెలియజేశారు. ఈ ప్రకటన అన్ని మతాలకు గొప్ప స్వేచ్ఛను, సమానత్వాన్ని చేకూర్చింది. విప్లవానికి పూర్వం మతగురువు ప్రభుత్వోద్యోగిగా ఉంటూ, ప్రభుత్వం నుండి జీతాన్ని పొందుతుండేవాడు. ఇప్పుడు, పై ప్రకటన చేయబడిన తర్వాత అతడు ప్రభుత్వోద్యోగిగా వుండడం లేదు. స్వతంత్రుడయ్యాడు. చర్చికివచ్చే చందాలు అతని ఆదాయం. పై ప్రకటన ప్రకారం అన్ని మతాలు సమాన హోదాగలవే గాబట్టి పూర్వం వివిధ మతాలమధ్య చెలరేగుతూ వచ్చిన కలహాలు అంతరించాయి.

## రష్యన్ సనాతన చర్చియొక్క నిర్మాణ వ్యవస్థ

రష్యన్ సనాతన చర్చి నిర్మాణ వ్యవస్థను

గురించి రుజిత్స్కి చక్కగా వివరించి చెప్పారు. మతగురువులు, మతగురువులు కాని క్రిస్టియన్ మతస్థుల ప్రతినిధులలో కూడిన మహా సభ యీ చర్చి యొక్క ఉన్నతాధికార సంస్థగా వుంటుంది. ఈ మహాసభే ప్రధాన మతగురువును ఎన్నుకొంటుంది. మహా సభలు జరగడానికి మధ్యకాలంలో చర్చి వ్యవహారాలలో అధికారం ప్రధాన మతగురువు చేతిలో ఉంటుంది. అతని తర్వాతి స్థానం బిషప్‌లది. ప్రతి బిషప్ ఒక ఎపిస్కోపేట్ (బిషప్ అధికారమండలం)పైన ఆధిపత్యాన్ని వహిస్తాడు. ప్రతి ఎపిస్కోపేట్‌లో కొందరు జనరల్ వికార్సు ఉంటారు. ఒక్కొక్క జనరల్ వికార్ క్రింద కొన్ని చర్చిలు ఉంటాయి. ఒక్కొక్క చర్చికి ఒక డీన్ అధిపతిగా ఉంటాడు. చర్చి పెద్దదయినట్లయితే డీన్‌కు సహాయం చేయడానికి అతనిక్రింద కొందరు మతగురువులుంటారు. సోవియట్ దేశంలో 20,000 చర్చిలు వున్నాయి. ఉత్తమమైన ప్రజాస్వామ్య పద్ధతులు చర్చి కార్యకలాపాల్లో ప్రవేశపెట్టబడుతున్నాయని రుజిత్స్కి ఉద్ఘాటించారు. ఉదాహరణకు, వికాహర్సుసమితులు తరుచు సమావేశపర్చబడుతుంటాయి, ఆసమావేశాల్లో మతగురువులు కాని వాళ్ళు గూడా పాల్గొంటారు. డీన్ అధ్యక్షత వహించి సమావేశాన్ని నడుపుతాడు.

## చర్చి ఆర్థిక వ్యవహారాలు

చర్చి తన ఆర్థిక సమస్యలను యేవిధంగా పరిష్కరించుకొంటుంది? ఇది చాలా ముఖ్యమైన సమస్య అని రుజిత్స్కి అన్నారు. విప్లవానికి పూర్వం ప్రభుత్వమే జీతాలను ఇచ్చేది. కాని, ఇప్పుడు, మతంలో నమ్మకం వున్నవారు యిచ్చే చందాల్లోంచి జీతాలు ఇవ్వబడుతున్నాయి. చట్టరీత్యాగాని, నిర్బంధంగాగాని వసూలు చేయబడవీ చందాలు. చందాలు ఇవ్వడమూ, ఎంత యివ్వడమన్న విషయమూ కేవలం మతంలో నమ్మకంగల ఆయా వ్యక్తులపైన ఆధారపడి వుంటుంది. ఈ నిధులనుండే చర్చిలకు, పరిషత్తుకు, సమావేశాలకు అయ్యే ఖర్చులు చేయబడుతుంటాయి. ఈ ఖర్చులు తక్కువగా మాత్రం వుండవు. ఒక్క ఆస్తిక పరిషత్తు మాత్రమే రోజుకు 10 000 రూబుళ్ళను ఖర్చు చేస్తుంది. అయినప్పటికి, చర్చికి యేనాడూ ఆర్థిక కష్టాలు ఎదురు కాలేదని రెక్టర్ రుజిత్స్కి అన్నారు.

## పరిషత్తు కార్యకలాపాలు

ఆస్తిక పాఠశాలలు, ఆస్తిక పరిషత్తు కార్యకలాపాల విషయాలను గురించి అడిగిన ప్రశ్నలకు రెక్టర్ రుజిత్స్కి చాలా ఉత్సాహంగా సమాధానా లిచ్చారు.

ఆస్తిక పాఠశాలల్లో చేరడానికి దరఖాస్తు పెట్టుకొనేవారికి కనీసం 17 సంత్సరాల వయస్సయినా ఉండాలి. ఆ వయస్సు వచ్చేటప్పటికి యువకులు పాఠశాల విద్యను పూర్తిగావిస్తారు. అప్పటకి వాళ్ళు స్వతంత్రంగా ఆలోచించగలిగే స్థితికి వస్తారన్న ఉద్దేశ్యంతో 17 సంవత్సరాలు కనీస వయస్సుగా నిర్ణయింపబడింది. ప్రతి దరఖాస్తుదారుడు ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణుడు కావాలి. ఆస్తిక పాఠశాల కోర్సు నాలుగు సంవత్సరాలది. ఆస్తిక పరిషత్తు నడిపేకోర్సు ఐదు సంవత్సరాలది. 1915 లో ఆస్తిక పరిషత్తులో పట్టభద్రులైన 270 మందిలో 70 మంది మాత్రమే మతగురువులుగా వుంటున్నారు. ఇప్పుడు పరిస్థితి పూర్తిగా మారిపోయింది; పట్టభద్రులైన 78 మందిలో ఇప్పుడు 75 మంది మతగురువులుగా వుంటున్నారు.

వివిధ కోర్సుల పాఠ్య ప్రణాళిక విషయంలో గొప్ప శ్రద్ధ చూపబడుతున్నది. పరిషత్తు నడిపే కోర్సుకు యీ దిగువ విషయాలను తప్పక చదువవలసి వుంటుంది:

1. సోవియట్ దేశ రాజ్యాంగ చట్టం.

2. రష్యన్ భాష (ప్రతివారికి చక్కని వక్తలు కావడానికి శిక్షణ యివ్వబడుతుంది గాబట్టి దీని విషయంలో గొప్పశ్రద్ధ తీసుకొనబడుతుంది).

3. సహజ ఆస్తిక సిద్ధాంతము, పిడివాద ఆస్తిక సిద్ధాంతము, నైతిక మత సిద్ధాంతము, మత గురువుల ఆధిక్యతను గుర్తించే మత సిద్ధాంతము.

4. సమకాలీన మతాలు, వాటి సిద్ధాంతాలు.

5. ప్రాచీన చరిత్ర.

6. సోవియట్ దేశ చరిత్ర.

7. ప్రాచ్యదేశాల చర్చిల చరిత్ర (స్లావ్, ఉదాహరణకు యుగొస్లావ్, బల్గేరియన్, గ్రీక్ మొదలైనవి).

8. న్యూ టెస్టమెంట్.

9. వక్తృత్వము (మత ధర్మ విషయిక ఉపన్యాసాలు మొదలైనవి).

10. చర్చి నిబంధనలు.

11. మత కర్మాకాండలను జరిపించుట.

12. ఒక విదేశిభాష (ఇంగ్లీషు, ఫ్రెంచి' జర్మన్).

13. ప్రాచీన భాషలు: గ్రీక్, ఇటాలియన్, హీబ్రూ.

14 చర్చి వాస్తు శిల్పము.

15. వాస్తుశిల్ప చరిత్ర.

పరిషత్తులో చేర్చుకొనబడిన ప్రతివిద్యార్థికి ఆహారం, గుడ్డలు, వసతి ఉచితంగా లభిస్తాయి. ఇవిగాక నెలకు 150 నుండి 500 రూబుళ్ళవరకు ఉపకారవేతనం లభిస్తుంది. పరిషత్తులో ప్రొఫెసర్‌గా పనిచేసేవారికి 5,500 రూబుళ్ళ వేతనం ఇవ్వబడుతుంది. అసిస్టెంటు ప్రొఫెసర్‌కు 3,500 రూబుళ్ళ జీతం యివ్వబడుతుంది. ఇదిగాక, జీతంతో సెలవు, పెన్షన్ యేర్పాట్లున్నాయి.

## చర్చి ప్రచురణలు

రష్యన్ సనాతన చర్చి రెండు మాగజైన్లను ప్రకటిస్తున్నది. మాస్కోనుండి "మాస్కోవ్స్కియా పాత్రియార్కియా" అను మాగ



*
త్రొయిత్సె సెర్గియేవ్ మఠం వద్దనున్న "టవర్ ది వెల్"గుడి

జైన్‌ను, కీవ్‌నుండి "దుఖోవ్నీ వెస్ట్నిక్" అను మాగజైన్ ప్రచురింప బడుతున్నాయి. ఫ్రాన్సులోను, అమెరికాలోను వున్న రష్యన్ కాందిశీకులుగూడా కొన్ని మాగజైన్లను ప్రకటిస్తున్నారు. 1955లో ఓల్డ్, న్యూ టెస్ట్‌మెంటులు కలిపి బైబుల్ అచ్చువేయబడింది. మతంలో నమ్మకం వున్నవారు వాటిని కొనుక్కొన్నారు. మత, తాత్త్విక విషయాలకు సంబంధించిన ఒక మాగజైన్‌ను ప్రకటించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని కాన్‌స్తాంతిన్ రుజిత్స్కి తెలియజేశారు.

## చర్చి, దేశంయొక్క రాజకీయ, ఆర్థిక సాంఘిక జీవితం

ప్రధానంగా విప్లవానంతరం, సోవియట్ దేశ ప్రజల రాజకీయ, ఆర్థిక, సాంఘిక జీవితంలో చర్చి వహించిన పాత్ర యేమిటో తెలుసుకోవాలన్న కుతూహలం నాకు కలిగింది. ప్రజల సాధారణ జీవితంలో చర్చి యేలాంటి పాత్రను వహించకుండా నిషేధింపబడిందని మామూలుగా భావింపబడుతూ వుంటుంది. ఇదివరకుచెప్పిన "మతం, ఆరాధనల స్వాతంత్ర్యాలపై అధికార ప్రకటన" జరిగినది మొదలుకొని చర్చి స్వాతంత్ర్యాన్ని పొందిందని రెక్టర్ రుజిత్స్కి తెలియజేశారు. సోవియట్‌దేశ పౌరునిగా చర్చియొక్క ప్రతి సభ్యునికి ప్రజల రాజకీయ, ఆర్థిక, సాంఘిక జీవితంలో తన ప్రయోజనకర పాత్రను వహించుటకు సంపూర్ణాధికారాలు ఉన్నాయి. నిజానికి వాళ్ళంతా తమ పౌరస్వత్వ అధికారాలను అనుభవిస్తూనే వున్నారు. ఒక సంస్థగా మాత్రం చర్చి ప్రజల రాజకీయార్థిక జీవితంలో జోక్యం కల్పించుకోదు. చర్చి, మత విషయిక సంస్థ. మత రంగంలో అది ఏలాంటి ఆటంకాలు లేకుండా తన పాత్రను వహిస్తుంది.

## చర్చి, శాంతి పోరాటం

యుద్ధము, శాంతి, అణు, ఉదజని ఆయుధాలు, నిరాయుధీకరణ మొదలైన సమస్యలపైన చర్చి దృక్పథం యేమిటి, అది అవలంబించే విధానమేమిటి అన్న ప్రపంచ ప్రాముఖ్యతగల విషయాలపైన నాకు సహజంగానే కుతూహలం కలిగింది. రష్యన్ సనాతన చర్చి దృక్పథాన్ని గురించి రుజిత్స్కి నాకు వివరించి చెప్పారు. "శాంతి" అన్న పదం ప్రతి ప్రార్థనలోను వినబడుతుంది. కొబట్టి ప్రతి మతస్థుడు శాంత్యభిలాషిగా పరిగణింపబడాలి.

ప్రధాన బిషప్ నికొలాయ్ ప్రపంచ శాంతి సమితిలో సభ్యుడుగా ఉంటూ, ప్రపంచ శాంతి ఉద్యమంలో ప్రముఖపాత్రను వహిస్తున్నారు. ప్రపంచ శాంతి సమితి మహాసభ జరిగిన కొలంబోనుండి ఆయన ఈ మధ్యనే తిరిగి వచ్చారు. శాంతి, నిరాయుధీకరణ, మూకఉమ్మడిగా ప్రజావినాశనాన్ని గావించే ఆయుధాల నిషేధం మొదలైన విషయాలపైన సనాతన చర్చి దృక్పథాన్ని ఆయన తెలియజేస్తారు.

1952వ సంవత్సరంలో రష్యన్ సనాతన చర్చి ప్రోత్సాహంతో సోవియట్ దేశంలోని సమస్త మతాల మహాసభ ఒకటి జరిగింది. ఇది విశిష్ట ప్రాముఖ్యతగల సమావేశం. అలాంటిది అంతకుముందెన్నడూ జరిగిఉండలేదు. ఆ మహాసభ గొప్ప మిత్రతా వాతావరణంలో జరిగింది. యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ, శాంతిని కోరుతూ యేకగ్రీవంగా తీర్మానింపబడింది.

రష్యన్ సనాతన చర్చి ఇతర దేశాలలోని చర్చిలతో తన సంబంధాలను విస్తృతం గావించుకొంటున్నది. గత సంవత్సరం దాని ప్రతినిధులు బాన్, ఆక్స్‌ఫోర్డ్‌లలో జరిగిన చర్చి మహాసభలకు హాజరయ్యారు. విప్లవానికి పూర్వం ఆంగ్లికన్ చర్చి, రష్యన్ సనాతన చర్చిల మధ్య ఐక్యతకు సంప్రదింపులు జరుగుతూ ఉండేవి. 1955లో యార్క్ బిషప్ రామ్సే సోవియట్ దేశంలో పర్యటించినప్పుడు మళ్ళీ యీ సమస్య ఆలోచించబడింది. సోవియట్ దేశ ప్రజలు అభ్యుదయ భావాలు కలవారైనప్పటికి మతానికి సంబంధించినంతవరకు వాళ్ళు చాలా సనాతనులేనని రుజిత్స్కి వ్యంగ్యంగా అన్నారు. ఈ ఐక్యతా సంప్రదింపులవల్ల చెప్పుకోదగిన ఫలితాలేమీ కలుగలేదు.

## భారతదేశానికి సందేశం

భారత ప్రజలకు, ప్రధానంగా భారతీయ సనాతన చర్చికి చెందిన క్రిస్టియన్లకు తాము యిచ్చే సందేశం యేమైనా ఉన్నదా అని రుజిత్స్కిని అడిగాను. భారతీయులంటే తమకు గొప్ప గౌరవమున్నదనీ, మలబారులోని సిరియన్ సనాతన చర్చి కార్యకలాపాలను గురించి విని తమకు సంతోషం కలిగిందనీ కె. రుజిత్స్కి అన్నారు. అలాంటి దూరదేశంలో సోదరులను కలిగి ఉండడం చాలా ఆనందదాయకమైన విషయమని కూడా అన్నారు. ఆస్తిక పరిషత్తులో భారతీయ విద్యార్థులు ఉంటే చాలా బాగుంటుందని తాను ఆస్తిక పరిషత్తు రెక్టర్‌గా భావిస్తున్నానని అన్నారు. ప్రస్తుతం ఆస్తిక పరిషత్తులో ఇద్దరు రుమేనియన్లు, ఇద్దరు అరబ్బులు, ఇద్దరు చెక్‌జాతివారు, ఒక సిరియన్ చదువుతున్నారనికూడా ఆయన చెప్పారు.

* * *

మా సంభాషణ పూర్తయిన తర్వాత రెక్టర్ కాన్‌స్తాంతిన్ రుజిత్స్కి నన్ను తీసుకొని వెళ్ళి పరిషత్తు కార్యాలయాన్ని చూపించి, అదినడుపుతున్న కార్యకలాపాలను గురించి తెలియజేసారు. ప్రపంచంలోని వివిధ ప్రాంతాలనుండి వచ్చిన మాగజైన్లు, వార్తా పత్రికలు గల పఠనాలయాన్నీ, సినిమా హాలునూ, ఉపన్యాసాలిచ్చే గదులనూ, విద్యార్థుల వసతిగృహాన్నీ, భోజనశాలనూ నాకు ఆయన చూపించారు. ప్రపంచ యువజనోత్సవానికి తయారవుతున్న కొందరు విద్యార్థులను పరిచయం చేసారు. చర్చిలతో నిండిన ఆ నగరంలోని ప్రాచీన చర్చిలయిన త్రాయిత్సీ సెర్జియెవిస్కీ చర్చినీ, ఉస్పెన్స్కి చర్చినీగూడా ఆయన నాకు చూపించారు.

త్రాయిత్సె సెర్జియేవ్ మఠపు గంటల గోపురం



# నిప్పుతో చెరలాటం సాగుతోనేవుంది

**పరిశీలకుడు**

అమెరికన్ సామ్రాజ్యవాదులు, సిరియా, తదితర అరబ్బు దేశాలకు వ్యతిరేకంగా కుట్రలను, కవ్వింపు చర్యలను జరిపిస్తున్న వారుగా ప్రపంచంముందు బట్టబయలయ్యారు. సమీప, మధ్యప్రాచ్యాలలో యుద్ధాన్ని ప్రజ్వలింపజేయడానికి అమెరికన్ పాలకవర్గాలుచేసిన దుష్టపన్నుగడలకు ప్రజలు కోపోద్రిక్తులై, వాటిని ఖండించి, స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను పరిరక్షించుకొంటున్న సిరియన్ ప్రజలకు తమ తోడ్పాటును తెలియజేశారు. ఈజిప్టు తన సేనలను సిరియాకు పంపించింది. మిత్రదేశంగా తమ విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చడానికి చివరివరకు నిలచివుండడానికి అవి సంసిద్ధంగా వున్నాయి. సైనిక జూదాలంటే కుతూహలంగా వారు ఒళ్ళు తెలియకుండా సిరియాపై దాడి జరిపినట్లయితే తాను దూరంగా కూర్చొని ఉండబోనని సోవియట్ దేశం దురాక్రమణదారులను గట్టిగా హెచ్చరించింది.

న్యాయంగానైతే, అలాంటి పరిస్థితుల్లో వలస పెత్తందారులు చల్లబడి ఊరుకోవాలి. కాని ఇప్పటివరకు అలాంటిదేమీ జరుగలేదు. ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని లెక్కచేయకుండా వాషింగ్టన్ ఇంకా సిరియాకు వ్యతిరేకంగా కుట్రలను కొనసాగిస్తూనే ఉన్నదని వాస్తవ విషయాలు తెలియజేస్తున్నాయి. "న్యూయార్క్ టైమ్స్" పత్రిక విలేఖరి తన సామ్రాజ్యవాద యజమానుల దృక్పథాలను తెలియజేస్తూ "అపాయస్థితి యెంతగా యేర్పడించంటే, యెంతటి సాహసానికి తలపడ్డా తప్పులేదు," అని వ్రాశాడు.

బ్రిటిష్ ప్రధాని మాక్మిలన్‌కూ, అమెరికా అధ్యక్షుడు ఐసన్‌హోవర్‌కూ మధ్య ఇటీవల జరిగిన సంప్రదింపుల ఫలితాలు గూడా, నిప్పుతో ప్రమాదకర చలగాటాన్ని ఇంకా కొనసాగించ దలుచుకున్న పాశ్చాత్యరాజ్యాల దౌర్జన్య వర్గాల ఉద్దేశ్యాలను వెల్లడిస్తాయి. అమెరికా, బ్రిటన్‌లు సిరియా, తదితర స్వతంత్ర దేశాలకు వ్యతిరేకంగా చర్యలను గైకొనడంలో సహకరించడానికి అంగీకారానికి వచ్చినట్లు ఆంగ్లో-అమెరికన్ సమిష్టి ప్రకటన వ్యక్తం చేస్తుంది.

సిరియాకు వ్యతిరేకంగా అమెరికా, టర్కీలు జరుపుతున్న కవ్వింపు కార్యకలాపాలను గురించి సిరియా చేసిన ఫిర్యాదును మిత్రరాజ్యసమితి చర్చించకుండా చేయడానికి పాశ్చాత్యరాజ్యాలు అన్ని విధాలా ప్రయత్నిస్తూ వచ్చాయి. సిరియన్-టర్కిష్ సరిహద్దులో పరిస్థితిని గురించి దర్యాప్తు జరపడానికి మిత్రరాజ్య సమితి కమీషన్‌ను పంపడానికి వ్యతిరేకిస్తున్నారు.

వాషింగ్టన్ తన దుష్టచర్యలలో ఇంకా ప్రధానంగా టర్కీపైన ఆధారపడుతున్నది. శాంతియుత సిరియాపై దురాక్రమణను జరపడానికి అమెరికా టర్కీని ప్రోత్సహిస్తున్నది. ప్రస్తుతం, ఎన్నికల్లో ప్రజాస్వామ్యపార్టీ విజయాన్ని పొందిన తర్వాత, టర్కీ యొక్క సైనిక సన్నాహాలు ఇంకా యెక్కువ వేగంతో కొనసాగుతున్నాయి. ప్రజలకు తెలియకుండా టర్కీ యొక్క పాలకవర్గాలు ఆ దేశాన్ని ప్రమాదకర జూదంలోకి లాగుతున్నాయి.

స్క్రిప్స్-హోవర్డ్-న్యూస్ పేపర్ ఏజన్సీ విలేఖరి ఫ్రెడ్ స్పార్క్స్ గాజియాన్టెప్ అను ఒక టర్కీ నగరం నుండి పంపిన వార్తను ప్రకటించిన "న్యూ వరల్డ్ టెలిగ్రామ్ ఎండ్ సన్" అను పత్రికను బట్టి, "సిరియన్ సరిహద్దులో సైన్యాల కదలిక కనబడుతున్నది. కొత్త సైనిక దళాలు వస్తున్నాయి. కీలక స్థానాలను ఆక్రమించుకొంటున్నాయి. భారీ ఫిరంగులు చెట్ల కొమ్మలు కప్పి దాయబడుతున్నాయి."

హెండర్‌సన్ అంకారాను సందర్శించిన సందర్భంలో సిద్ధం చేయబడిన పథకాల ననుసరించి టర్కిష్ సైనికాధికారవర్గం ప్రస్తుతం లక్షమంది సైనికులను సిరియన్ సరిహద్దుకు మార్చింది. ఆ సైన్యం ఆధీనంలో వందలాది అమెరికన్ టాంకులు, విమానాలు, ఫిరంగులు వున్నాయి.

సిరియా సరిహద్దున ఉన్న అలెగ్జాండ్రెట్టా సాండ్జెక్ ప్రాంతములో 60,000 మంది సైనికులూ, అనేక టాంకులూ వున్నాయి.

భారీ ఫిరంగులను, టాంకులనూ కలిగివున్న కొత్త టర్కిష్ సైనిక దళాలు సిరియా సరిహద్దుకు చేరుకొన్నట్లు సిరియన్ సరిహద్దు అధికారులకు సమాచారం అందిందని "అల్ ఫైహా" అనే సిరియన్ పత్రిక విలేఖరి అలెప్పో నుండి తెలియజేస్తున్నాడు. ఈ సైన్యాలు గబ్గావా పరిసర ప్రాంతాల్లో ఉంచబడ్డాయి.

టర్కిష్ సైన్యాలకు అమెరికన్ సైనిక సలహాదారులు ఉన్నారు. సైన్యాలు చర్యకు సంసిద్ధంగా ఉండి, ఉత్తరవులకొరకు కాచుకొని ఉన్నాయి. "న్యూయార్క్ టైమ్స్" లాంటి అమెరికన్ వార్తాపత్రిక గూడా సిరియా సరిహద్దులో అంకారా "సాధారణ సైనిక ప్రదర్శనను మించి గూడా చర్యలను గైకొన్నదని" అంగీకరించక తప్పలేదు.

అమెరికన్ ఆయుధాలు, పరికరాలు నిరంతరం టర్కీకి చేరు కొంటున్నాయి. అవన్నీ దక్షిణ ప్రాంతాలలో వున్న టర్కిష్ సైన్యాలకు పంపించబడుతున్నాయి. సమీప భవిష్యత్తులో అమెరికా నుండి టర్కీకి గైడెడ్ మిసైల్స్ వస్తాయని యీ మధ్యనే ఒక అంకారా వార్తాసంస్థ ప్రకటించింది.

టర్కిష్ నావికాదళాన్ని తన దుర్మార్గపు పథకాలకు ఉపయోగించుకోడానికి అమెరికా దానికి అన్నివిధాల సహాయపడుతున్నది. ప్రథమంలో అమెరికాదే నిర్మించిన నాలుగు టర్కిష్ డిస్ట్రాయర్ నౌకలను (గెమ్లిక్, గాజియాతెప్, గిరెసున్, గెలిబొల్) ఆధునిక పరికరాలతో అమర్చడాన్ని అమెరికా పూర్తిచేసింది. ఈ నౌకలు ఇప్పుడు హుటాహుటిగా వాటి నౌకాశ్రయాలకు పంపబడుతున్నాయి.

టర్కిష్ సైన్యాలకూ, నావికాబలానికీ అదనపు బలాలు చేకూర్చబడడమూ, అమెరికన్ ఆయుధాలు దేశంలోకి ధారావాహికంగా రావడమూ, సమీప, మధ్యప్రాచ్యాలలోని తమ వలస పెత్తందారీ పథకాలను సాధించుకొనేందుకు టర్కీని ఒక ఆయుధంగా

ఉపయోగించుకోవాలన్న అమెరికన్ సామ్రాజ్యవాదుల అభిలాష ననుసరించి జరుగుతున్నాయి.

'నాటో' సాయుధబలాలు పెద్దయెత్తున జరుపుతున్న సైనిక విన్యాసాలు, సమీప, మధ్యప్రాచ్యాలలోని యుద్ధ సన్నాహాలతో ప్రత్యక్ష సంబంధాలను కలిగివున్నాయి. భూసైన్యాలు, వైమానిక దళాలు, నావికాదళాలు, అందులోను ప్రధానంగా అమెరికన్ జనరల్ హార్కిన్స్ నాయకత్వంలో ఉన్న భూసైన్యాలు, ప్రాచ్యమధ్యధరాసముద్రంలోని అమెరికన్ 6వ నౌకాదళం, బ్రిటిష్ నావికాదళాలకు చెందిన మరికొన్ని నౌకలు ఈ సైనిక విన్యాసాలలో పాల్గొంటున్నాయి. ఈ సైనిక విన్యాసాల సమయంలో "అణ్వాయుధ దాడులు" గూడా జరుపబడుతాయని ఇస్తాంబుల్ పత్రికలు తెలియజేస్తున్నాయి.

ప్రాచ్య మధ్యధరా సముద్రంలో దౌర్జన్య 'నాటో' కూటమి జరుపుతున్న సైనిక విన్యాసాల సందర్భంలో సందర్భంలో, సిరియా అక్టోబరు 28 వ తేదీన, 'నాటో' తన చర్యలను బలపరుస్తుందన్న అంచనాతో యీ సైనిక విన్యాసాలను సిరియాపై దురాక్రమణ చర్యలను జరపడానికి టర్కీ ఉపయోగించుకొనగల పరిస్థితులవల్ల ఏర్పడుతున్న ప్రమాదాన్ని వెల్లడిస్తూ 'నాటో' దేశాలకు లేఖలను పంపింది. ఆ లేఖల్లో ఇలా వున్నది : "టర్కిష్ సైన్యానికి తోడ్పాటుగా నిలబడడమే టర్కిష్ తీరాలలోను, సిరియన్ సరిహద్దులోను తిరుగుతున్న 'నాటో' సేనల ఉద్దేశ్యం. ఇది, 'నాటో' సైన్యాన్ని దురాక్రమణ ఆయుధంగా మార్చివేయ వచ్చును."

సమీప, మధ్య ప్రాచ్యాలలో సామ్రాజ్యవాదులయొక్క "అధికారం కొరకు ప్రాకులాడే రాజకీయాలూ", సిరియన్ రిపబ్లిక్‌కు వ్యతిరేకంగా జరుపబడుతున్న ప్రచ్ఛన్న యుద్ధమూ, ఆ ప్రాంతంలో ఇప్పటికీ ఉద్రిక్తపూరితమైయున్న పరిస్థితులను మరింత తీవ్రతరం చేయడానికీ, దురాక్రమణ సన్నాహానికి ఉద్దేశింపబడ్డాయన్నది స్పష్టం. శాంతిప్రియ దేశాలు సామ్రాజ్యవాదులు జరుపుతున్న ప్రమాదకర కుతంత్రాలను ఉపేక్షాభావంతో చూస్తూ కూర్చొనజాలవు. సైనిక జూదాలపై అభిలాషగలవారి దుష్ట పథకాలను వమ్ము గావించడానికి కృతనిశ్చయతతో వున్నాయి.

("సోవెత్స్కీ ఫ్లోట్" నుండి పునర్ముద్రితం.)

# ఢిల్లీలో అక్టోబర్ విప్లవ 40వ వార్షికోత్సవం

అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం 40 వ వార్షికోత్సవాన్ని జరుపడానికి భారత-సోవియట్ సాంస్కృతిక సంఘం నవంబరు రెండవ తేదీన ఢిల్లీ టౌన్‌హాలులో ఒక బహిరంగ సభను జరిపింది. మర్నాడు ఒక గోష్ఠి యేర్పాటు చేయబడింది. "సోవియట్ దేశంలో విద్య", "అక్టోబరు విప్లవంతో భారత ప్రజల సంబంధాలు" అన్న వ్యాసాలు చదువబడ్డాయి. భారతదేశాన్ని గురించి సోవియట్ దేశంలో ప్రకటింపబడిన గ్రంథాలు, సోవియట్ దేశంలో ప్రకటింపబడిన భారతీయ రచయితల గ్రంథాలప్రదర్శన ఒకటి జరుపబడింది. ఈ మహోత్సవ సందర్భంలో ఇండో-సోవియట్ సాంస్కృతిక సంఘం అధ్యక్షుడు, సభ్యులు ఒక విందును యేర్పాటు చేశారు.

టౌన్‌హాలులో జరిగిన బహిరంగ సభకు ఢిల్లీ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు డాక్టర్ వి. కె. ఆర్. వి. రావు అధ్యక్షత వహించారు. నాగరకత చరిత్రలో అక్టోబరు విప్లవం ఒక ప్రధాన ఘట్టమని ఆయన ఉద్ఘాటించారు. "సోవియట్ ప్రజలు భారత యూనియన్‌కు మిత్రులైనట్టే మేముకూడా సోవియట్ యూనియన్‌కు మిత్రులము." అన్నారు.

అక్టోబరు విప్లవోత్సవం సందర్భంలో సోవియట్ ప్రజలకు అందజేయబడిన శుభాకాంక్షలకు కృతజ్ఞతను తెలుపుతూ సోవియట్ రాయబారి ఎమ్. ఎ. మెన్షికోవ్ ఇలా అన్నారు : "ప్రపంచమంతటా వున్న మా మిత్రులు సోవియట్ ప్రజల ఉత్సవదినాన్ని జరుపుకొంటున్నారన్న విషయమే, సామాన్య ప్రజల ప్రయోజనాలను, శాంతి, అభ్యుదయాలను, సంస్కృతి అభివృద్ధిని, శ్రమిక ప్రజల శ్రేయస్సును, వివిధ ప్రజల మధ్య మైత్రిని గౌరవించే నిజాయితీపరులైన ప్రజలందరు మా దేశంలో 1917 అక్టోబరులోను, ఆ తర్వాతను జరిగిన మార్పులను యెంతో సానుభూతితో చూస్తున్నారని రుజువు చేస్తుంది."



ఢిల్లీ టౌనుహాలులో జరిగిన బహిరంగ సభలో సోవియట్ రాయబారి మిస్టర్ మెన్షికోవ్ ప్రసంగిస్తోన్న దృశ్యం

# మానవుడి పాట్లు

కథకుడు:- మిఖయిల్ షొలఖోవ్ అనువాదకుడు:- శ్రీ.శ్రీ.

(20వ సంచిక తరువాయి)

ఏదో ఆవేశంలో నడుస్తున్నానే కాని, అసలు నిజం చెప్పాలంటే, నా కాళ్ళల్లో కొంచంకూడా బలంలేదు, అవి వాటిష్టమొచ్చినట్టు లాక్కెళ్ళుతున్నాయ్.... చూస్తున్నానన్నమాటేగాని, తాగినప్పటికంటే యెక్కువ మైకంగా వుంది... అసలంతా మసక మసకగా వుంది. అయినా నడుస్తూనే వున్నా. అలా నడుస్తూనే వెళ్తే, గంటసేపటికి, ఒక కిలోమీటరు దూరంకూడా వెళ్ళలేను. న్యాయం ఆలోచిస్తేమరి, ఆ స్థితిలో ఆ మాత్రం వెళ్ళటం గొప్పే.... అలాపడుతూ, లేస్తూ, అతి కష్టంమీద కొంతదూరం వెళ్ళానోలేదో...., అటునుంచి వస్తున్న కొందరు మనుషులు కనిపించారు. వాళ్ళు దగ్గరౌతున్నకొద్ది స్పష్టంగా కనిపించారు.... వాళ్ళంతా నాలాగే ఖైదీలుగా పట్టుబడ్డవాళ్ళే.... బాగా పరికించి చూడగా, వాళ్ళంతా, మా 'డివిజన్'కి చెందిన బాపతులాగే అగుపడ్డారు.... సుమారు, పదిమంది జర్మన్ సబ్‌మిషన్ గన్నర్స్, వాళ్ళచుట్టూ కాపలావుండి తీసుకొస్తున్నారు.... వాళ్ళు నాకు మరీ దగ్గరగా వచ్చారు. ఆ 'గన్నర్స్'లో ఒకడు నన్నుచూసి, ఏమీ మట్టాడకుండానే, తుపాకి మడమతో నన్ను బలంగా మోది, ఆ గుంపులోకి నెట్టాడు.... ఆ దెబ్బకు నేనుకాని క్రిందపడినట్టయితే, ఆ జర్మన్ గాడిదకొడుకు నా అంతం చూసేవాడే. కాని అదృష్టవశాత్తు, నా తోటి ఖైదీల్లో ఎవరో ఒకడు నన్ను పడిపోకుండా పట్టుకుని, నెమ్మదిగా నా చెవిలో ఊదాడు "ఓపిక తెచ్చుకో సోదరా, కిందపడ్డావంటే, వాళ్ళు నీప్రాణాలు తీసేస్తారు...." నాలో ఏ వీసమెత్తో మిగిలిపోయిన శక్తిని కూడగట్టుకుని, అలాగే కాళ్ళీడ్చాను....

రాత్రి అవగానే, వాళ్ళు లారీలో, మరో ఇరవై మంది మిషన్‌గన్నర్స్‌ని తీసుకొచ్చారు. వాళ్ళు త్వరగా నడవమని మమ్మల్ని తొందర పెట్టడం మొదలెట్టారు. తొందరగా నడవలేని వాళ్ళను, తుపాకి మడమలతో కొడుతున్నారు.... కొందర్ని బూట్లతో తంతున్నారు.... అసలు ఇంక నడవలేక పడిపోయినవాళ్ళను, రాక్షసంగా, షూట్ చేస్తున్నారు.... ఎలాగోలా పారిపోవాలని వృధాగా ప్రయత్నించారు కొందరు... వాళ్ళ మూర్ఖత్వం కాకపోతే, ఎంత పరిగెత్తినా, వెన్నెలలో, కిలోమీటర్ దూరంలో వున్నాసరే కనబడరటయ్యా.... మొత్తానికి వాళ్ళను షూట్ చేసేశార్లే.... ఎవరు ఎప్పుడు చస్తారో తెలీక, ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని, అర్ధరాత్రయేటప్పటికి, ఒక గ్రామానికి చేరుకున్నాం.... బాంబులు పడ్డాయేమో, ఆ గ్రామంలోని ఇళ్ళలో సగంపైగా కూలిపోయాయ్ .. అక్కడెవరూ మనుషులున్న జాడ కనబడటంలా. ఊరి మధ్యలోని చర్చి దగ్గరకు తీసుకెళ్ళారు మమ్మల్ని, దానిమీదకూడా బాంబు పడినట్టుంది. దానిముందు భాగం అంతా కూలిపోయింది. ఆ రాత్రంతా, ఆ చర్చిలోనే గడపాలి. నేల, మంచుకన్న చల్లగా వుంది. మాలో ఎవరిదగ్గరకూడా, మంచి కోట్లు కూడాలేవు. మాదళసరి 'యూనిఫారం'లోనే వున్నాం.... కొందరికి, అవి కూడా లేవు.... వాళ్ళంతా మామూలు చొక్కాలే తొడుక్కున్నారు. వాళ్ళంతా జ్యూనియర్ ఆఫీసరలాగున్నారు. 'యూనిఫారం' వుంటే, తమని సులభంగా గుర్తుపడ్తారని, అవి తీసేశారనుకున్నా....



మిఖయిల్ షొలఖోవ్

ఆ రాత్రంతా భోరున వర్షం కురుస్తూనే వుంది. ఆ చర్చి మీద భాగంకూడా చాలా కూలిపోవటంవల్ల, మేం అంతాతడిసి ముద్దయిపోయాం.. అక్కడ ఒక్క అంగుళం మేర అయినా పొడిగా మిగలలేదు.... ఆ వర్షంలో తడుస్తూ, ఆ చీకటికొట్లోనే, రాత్రంతా గడపాలి.... అబ్బ. తలుచుకుంటే గుండె పగులుతుంది. అయినా ఏం చేస్తాం.... అలాగే వుండిపోయాం. అర్ధరాత్రిలో ఎవరో నా భుజం తట్టినట్టయి చూశా. ఒకతను నన్ను అడుగుతున్నాడు. "గాయాలు బాగా తగిలాయా కామ్రేడ్ ?" "ఏం అలా అడుగుతున్నావేం సోదరా ?" అన్నా నేను అతని ముఖం పరికిస్తూ. "నేను డాక్టర్నిలే. నీకేవిధంగానైనా సాయపడగలనని" అన్నాడు. అతనికి నా ఎడం భుజం చూపించా. అది వాచిపోయి, చాలాబాధ పెడుతోందని చెప్పా. "అయితే చొక్కా తీసేయ్...." అన్నాడు.... అతను చెప్పినట్టేచేశా, అతను, నాకు దెబ్బ తగిలినచోట, వేళ్ళతో నొక్కి చూస్తున్నాడు.... అతనలా నొక్కుతూంటే నాకు చాలా బాధనిపించింది. అయినా ఓర్చుకున్నా.... అతనింకా నొక్కుతూనే వున్నాడు. నాకు భలే కోపమొచ్చింది. "ఏంటలా నొక్కుతావ్ ! నాకెంత బాధగావుందో తెల్సా. నువ్వు డాక్టరివా, దెయ్యానివా ?" అన్నాను పళ్ళు మండిపోయి. అయినా అతను మానకుండానే "మాట్లాడకుండా నోరు మూసుక్కూచో. ఏం చెయ్యద్దన్నావంటే, మరో నిమిషంలో, బాధతో ఛస్తావ్" అంటూ...., నా చేతిని గట్టిగా విదిలించాడు. హబ్బ ! అది ఎంత బాధ పెట్టిందనుకున్నావ్ ? దెబ్బకు నా కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయ్....

ఆ డాక్టర్ని చూస్తే నాకు భలే చిర్రెత్తింది. అతను నా పాలిటొక యమదూతగా కనిపించాడు. "ఏమిటి నువ్వుచేసిన పని ? అసలే, దెబ్బ తగలుంటే, దాన్ని విదిలిస్తావా ? నువ్వు మనిషివికాదు. రాక్షసుడివి" అంటూ ఇంకా ఏమేమో తిడుతున్నా పిచ్చికోపంలో. అతను మాత్రం చిన్నగా నవ్వాడు "ఇంకా నయం. ఆ చెయ్యి విదిలిస్తోంటే, రెండోచేత్తో ఒకటిస్తామనుకున్నా.... చూస్తే మంచివాడిలాగా వున్నావ్, నీ చెయ్యి విరిగిపోలేదయ్యా. కీలు జాయింటు తప్పిందంతే. అది మళ్ళీ సరిగ్గా పెటడంకోసం అలా విదిలించాల్సి వచ్చింది. ఇంకో నిమిషంలో, నీనెప్పి తగ్గిపోతుందిచూడు...." అన్నాడతను. అతను చెప్పింది నిజమే. నానొప్పి కొంచెం తగ్గింది. అతనికి మనసులోనే కృతజ్ఞత తెల్పుకున్నా. "ఇంకా యెక్కడ తగిలాయ్ దెబ్బలు ?"

అడిగాడు అతను. మాట్లాడకుండా చూపించా....ఆ చీకట్లోనే, తన పని చేస్తున్నాడు. అతను డాక్టర్ కాదు. నిజంగా దేవుడే అనుకున్నా.

ఆ రాత్రంతా చాలా చిరాగ్గావుంది. పోనీ బైటకుపోతే. తేలికగా వుంటుందనుకుంటే, అసలువాళ్ళు బైటకు వెళ్ళనీరు. ఆ సంగతి ముందే చెప్పాడొక మెషీన్ గన్నర్....మాలో ఒకడున్నాడు. దురదృష్టవశాత్తు వాడికి దేవుడంటే మహాపిచ్చి. తనక్కడుండటంవల్ల, ఆ ప్రదేశం అంతా అపవిత్రం అవుతోందంటాడు. అది మహాపాపం అంట....బైటకు పోవడం ఎలా అంటాడు....మా సంగతి నీకు తెల్సే వుంటుంది. కొందరు వాణ్ణి చూసి నవ్వటం మొదలెట్టారు. కొందరు తిట్టారు. కొందరు ఏడిపించటం మొదలెట్టారు. వాళ్లు అట్టా చేయడంతో, వాడిపిచ్చి మరీ యెక్కువై పోయింది....అది చాలా చెడ్డగా పరిణమించింది. వాడేం చేశాడో తెల్సా....తలుపుదగ్గరకు పోయి. తనను బైటకు వదలమని అరుస్తూ, తలుపు దబదబా బాదటం మొదలెట్టాడు....కొంత సేపయిన తర్వాత, ఒక జర్మన్, మెషిన్ గన్‌తో జవాబిచ్చాడు. ఘోరం ఆ పిచ్చాడుతోబాటు మరి ముగ్గురు కూడా చచ్చిపోయారు....ఇంకోడికి తీవ్రంగా గాయాలు తగిలాయ్.... వాడుకూడా, ప్రొద్దుటికి చచ్చిపోయాడు.

శవాలనన్నీ ఒక మూలకి లాగి, అంతా నిశ్శబ్దంగా కూర్చున్నాం. ఈ ఘోరమైన సంఘటన జరిగినందుకు అంతు విచారించాం ఆ చీకట్లోనే. ఒకళ్ళనొకళ్లు తెల్సుకోడానికి ప్రయత్నం చేస్తున్నాం. ఎక్కడ చూసినా గుసగుసలేకాని, ఒక్కడూ గట్టిగా మాట్లాడటం లేదు. ఒకే 'ప్లాటూన్'కు చెందినవాళ్ళు, ఒకేచోటులో పనిచేసిన వాళ్ళు దగ్గరకంటా కూర్చుని, వాళ్ళు వాళ్ళు, ఎలా ఖైదీలుగా పట్టుబడ్డారో చెప్పుకుంటున్నారు. అలాటి అవకాశం ఇంతవరకూ ఎవరికీ దొరకలేదు. అందుకే ప్రతీవాడు ఇంకోడితో మాట్లాడుతున్నాడు· నాప్రక్కనే వున్న ఇద్దరి మాటలు మటుకు నాకు స్పష్టంగా వినిపిస్తున్నాయ్. వాళ్ళల్లో ఒకడిలా అంటున్నాడు.... "రేపు ప్రొద్దున్న, ఇక్కడనుండి తీసుకెళ్ళేముందు, మనల్ని నుంచోపెట్టి, కమ్యూనిస్టులెవరో, కమిస్సార్లెవరో, ఆఫీసర్లెవరో అడుగుతారు. వాళ్ళనుండి తప్పించుకోవటానికి వేసిన నీఎత్తు నాకు తెల్సులే కమాండర్. చొక్కా తీసేసినంతమాత్రాన వాళ్ళు నిన్ను గుర్తుపట్టలేరని నీ ఊహ; ఔనా ? కాని, నే నొదుల్తాననిమాత్రం అనుకోకు. నువ్వు కమ్యూనిస్టువని, వాళ్ళతో ఖచ్చితంగా చెప్తా"అని అంటున్నవాడు నాకు బాగా దగ్గర్లో కూచున్నాడు. వాడి ఎదురుగుండావున్నతను జవాబిస్తున్నాడు. అతనిమాటల్నిబట్టి, అతను యువకుడే అనుకున్నా· "నువ్వంటే నాకు మొదట్నుంచీ అనుమానంగానేవుంది. ముఖ్యంగా చదువురాదని కారణంచూపిస్తూ, పార్టీలో చేరనని చెప్పినప్పుడే అనుకున్నా నువ్వెప్పుడైనా ఇలా మారొచ్చని. ఎంతమారినా ఇంత ద్రోహివౌతావని మాత్రం నేనెప్పుడూ అనుకోలేదు....నువ్వు పన్నాలుగో సంవత్సరం వచ్చేంతవరకూ చదువుకున్నావ్. కాదంటావా?" అని అడుగుతున్నాడు. రెండోవాడు దానికి ఖాతరుచేసినట్టెక్కడా కనపళ్ళేదు. "ఔను చదువుకున్నా. అయితే ఇప్పుడేంటి ?" అని కొంచెం విసుగ్గానే అడిగాడు మొదటివాడు....దానికి, రెండోఅతనేమీ అనలేదు....అలా ఇద్దరూ, చాలాసేపు మౌనంగా వుండిపోయారు. తర్వాత, ప్లాటూన్ కమాండరే అన్నాడు. "నన్ను చూపెట్టడంవల్ల చాలా నష్టంవుంది. అలా చేయకు కామ్రేడ్" నేను నీ కామ్రేడ్‌ని కాదు....కామ్రేడ్స్, దేశభక్తి, ఇవన్నీ సరిహద్దులు దాటగానే, పోయాయ్....నాకు ఎవరు ఎలాపోయినా అవసరం లేదు....నేను మటుకు బాగుండాలి. అందుకు ఏదైనాసరే చేస్తాను. అదీ నాపాలసీ" అని అన్నాడా మొదటివాడు. ఆ తర్వాత, అసలువాళ్ళేమీ మాట్లాడలేదు. వాడిలో కరడుకట్టుకుపోయిన స్వార్థంచూస్తే, వాడంటే, పరమఅసహ్యం వేసింది. ఇలాంటి ద్రోహులు వుండటంవల్ల దేశానికే చాలా నష్టం....వాడు ప్రొద్దునదాకా బతికివున్నాడంటే, నిజంగా అన్నంతపని చేసేస్తాడు....కాని, ఆ యువకుడు, వాడికి బుద్ధిచెప్పలేడు....అతను చాలా బలహీనంగా వున్నాడు....సరే, అయితే, వాడిపని నేనే పట్టాలని, లేచాను....ఆ యువకుడి దగ్గరకు వెళ్ళి, "నువ్వేనా కమాండర్‌వి"అని అడిగా. అతను ఔనన్నట్టుగా తలూపాడు.... "నిన్నువాడు వాళ్ళకప్పజెప్తానంటున్నాడుగా. ఈ ద్రోహికి నేబుద్ధిచెప్తా... వాడు తన్నకుండా, వాడికాళ్ళు గట్టిగా పట్టుకో.... తక్కినపనినేచేస్తా...." అన్నా. అతను 'సర్లే' అనుకుని, వెళ్ళి వాడికాళ్ళు గట్టిగా పట్టుకున్నాడు. నేను వాడి గుండెలమీద కూర్చుని రెండుచేతుల్తో, గట్టిగా పీక నొక్కటం మొదలెట్టా....అరవటానికి కూడా వాడికి అవకాశం కలగలేదు. అలా పదినిమిషాలు పెనుగులాడాక, వాడు నాలిక బైటకుచాచి, కళ్ళుతేలేసేశాడు. ఆ దెబ్బతో ఒక ద్రోహి పని ఖాళీ....

ఏదో ఛండాలమైన పాముని చంపినట్టనిపించి, చాలా రోత కలిగింది. అంతవరకూ, నాచేతుల్తో ఎవ్వర్నీ చంపలేదు. అందులో మనవాణ్ని ; మనవాడేంటిలే....వాడు ద్రోహి. నన్నడిగితే అసలు ద్రోహికంటే గర్భశత్రువైనా నయమేనంటా. తర్వాత, ఆ యువకుడిదగ్గరికెళ్ళి "కామ్రేడ్ ఇక్కడెందుకు ? ఇంకెక్కడైనా పడుకుందాం. ఈ చర్చి చాలా పెద్దదేలే. రా"అంటూ లేచాను. అతను నన్ననుసరించాడు.

వాడన్నట్టుగానే, మర్నాడు మమ్మల్నందర్నీ వరసగా నుంచోపెట్టి, అడగటం మొదలెట్టారు మాలో కమ్యూనిస్టులు, కమిస్సార్లు, ఆఫీసర్లు ఎవరెవరని....కాని ఒక్కడూ చెప్పలేదు....పోనీ, ఎవరెవరు ఏంటో చెప్పడానికి ద్రోహులుకూడా ఎవరూ కనపళ్ళేదు వాళ్ళకి. మొత్తంమీద, మా రెండు వందలమందిలోనూ, నలుగుర్ని బైటకు లాగారు. వాళ్ళల్లో ముగ్గురు రష్యన్లు, ఒకడు 'జ్యూ'. ఆ రష్యన్లు నల్లగా వుండి. ఉంగరాల జుత్తుతో వుండటమే చిక్కొచ్చింది పాపం. జర్మన్ ఆఫీసర్లు, వాళ్ళదగ్గరకొచ్చి 'జ్యూ'వా అని అడిగి, వాళ్లు కాదని అంటూన్నా వినిపించుకోకుండా లాక్కెళ్ళారు.

ముండాకొడుకులు, ఆ నలుగుర్నీ, నిర్దాక్షిణ్యంగా కాల్చేసి' మమ్మల్నందర్నీ ముందుకు తీసుకెళ్ళారు. ఆ కమాండర్, 'పొజ్నాన్' వరకూ నా పక్కనే నడుస్తూ వచ్చాడు....కాని, 'పొజ్నాన్' లో మటుకు మేం ఇద్దరం విడిపోయాం. అదెలా జరిగిందంటావేమో ; చెప్తా విను .. చూడు సోదరా....నేను ఖైదీగా పట్టుబడ్డప్పటినుంచీ, పారిపోవటం ఎలాగా అని ఆలోచిస్తూనే వున్నా....మంచి అవకాశం వుంటేనే ఆ పని చెయ్యాలి. లేకపోతే, మరీప్రమాదం....'పొజ్నాన్' వచ్చే లోపల మేం చాలా 'క్యాంప్'ల్లోనే వున్నాం. కాని అక్కచెక్కడా నాకలాటి అవకాశం దొరకలేదు....ఇప్పుడే 'పొజ్నాన్' క్యాంప్ చూస్తూంటే, ఇక్కడ మంచి అవకాశం వున్నట్టే కనిపించింది. రక్తవిరేచనాలు పట్టుకుని, 'మే'మాసాంతంలో, మావాళ్లు చాలా మందే చచ్చిపోయారు....వాళ్ళందర్నీ పూడ్చటం కోసం, గోతులు తవ్వమని, మమ్మల్ని, ఆ దగ్గర్లోవున్న చిన్న అడవికి పంపించారు.... గొయ్యి తవ్వుతూ, నన్ను కాపలాకాసే వాళ్ళని చూశాను. వాళ్ళలో

ఇద్దరు ఒకచెట్టుకింద కూర్చుని, పోతుల్లా ఏదో తింటున్నారు తక్కిన ప్రపంచాన్నంతా మర్చిపోయి. మరొకడు, ఎండ భరించలేక, ఇంకో చెట్టుకింద కూర్చొని, కునికిపాట్లు పడుతున్నాడు....వాడసలు యీ లోకంలో వున్నట్టు కనిపించలేదు....ఇంతకన్నా మంచి అదును ఎప్పుడు దొరుకుతుంది. చేతిలోని గునపం క్రిందపడేసి, ఒకదుబ్బు చాటుకి పరుగెత్తా. వాళ్ళవరూ నన్ను చూడలేదని రూఢిచేసుకున్నాక, పడమటివైపుకు దౌడుతీసా....

వాళ్ళప్పుడప్పుడే గుర్తుపట్టివుండర్లే. అందుకే నన్నెవరూ తరమలేదు. అబ్బ! ఎముకల గూడులా వున్న నాకు బలం ఎక్కడ నుంచివచ్చిందో మరి, ఆరోజు, 40 కిలోమీటర్లు పరుగెత్తాను. చెప్తే నమ్మలేనట్టుగా వుంటుందికదూ? నాకే ఆశ్చర్యంవేసింది.... అలా, ఊపిరాడకుండా నాలుగురోజులు పరిగెత్తా. కాని లాభం ఏంటి? ఆ వేధపలు, నాలుగోరోజునే, నన్ను పట్టేసుకున్నారు....

ఛ. అదికూడా అనుకోకుండానే జరిగింది. నేను పరుగెడుతూ ప్రొద్దున్నయేటప్పటికి ఒక పెద్ద బహిరంగ ప్రదేశం దగ్గరకొచ్చాను. అక్కడ్నుంచీ, అడవి దగ్గరకెళ్ళాలంటే, కనీసం, 3 కిలోమీటర్లయినా ఆ బహిరంగ ప్రదేశంలోంచి దాటాలి పగటిపూట, ఆ బయళ్ళలో పారిపోవటం ప్రమాదంఅనుకుని, అక్కడే ఏపుగా పెరిగిన గడ్డిలో దాగుకున్నాను....అలా కొంతసేపు జరిగిపోయింది. తర్వాత, నాకు దగ్గర్లోనే, కుక్కల అరుపులు, మోటారుసైకిళ్ళరొద వినపడింది.... కుక్కలు అరుచుకుంటూ నాకు మరీదగ్గరయ్యాయ్....నాగుండె ఆగి నంతపనయింది....అవి కరవకుండా వుండాలని, రెండు చేతుల్తోనూ ముఖం కప్పేసుకున్నా. అవి రానేవచ్చేశాయ్....నన్ను చూడగానే, అన్నీ ఒక్కసారే, నామీద విరుచుకపడ్డాయ్....అంతే ఒక్క నిమిషంలో....నావంటిమీద ఒక్క గుడ్డపేలిక కూడా మిగల్లేదు....నా శరీరంతో వాటిష్టమొచ్చినట్టు ఆడుకుంటున్నాయ్....వాటిల్లో పెద్ద కుక్క ఒకటి, నా గుండెలమీదకురికి, దాని గోళ్ళతో, నా గొంతును గీరటం మొదలెట్టింది...ఇంకానయం. అదికూడా కరవటం మొదలెడితే, అప్పటికే కండలు బైటికొచ్చి చస్తున్న నాపని ఖాళీ అయ్యేదే....

ఇంతలో, మోటారుసైకిళ్ళమీద ఇద్దరు జర్మన్లు వచ్చారు.... వాళ్ళు రావటంతోటే, కొరడాలతో మాట్లాడటం మొదలెట్టారు. అలా కొట్టికొట్టి అలసిపోయి, చివరకు, ఆ దగ్గర్లోవున్న క్యాంప్‌కు లాక్కెళ్ళారు...రక్తాలు కారుతూన్న నా బోసివళ్ళు, వాళ్ళు ఈడ్చుకెళ్తుంటే ఎంత బాధపెట్టిందో చెప్పలేను....పారిపోవటానికి ప్రయత్నించినందుకుగాను, వాళ్ళు నన్ను "ఒంటరిఖైదు"లో నెల్లాళ్ళు వుంచారు .. "ఒంటరిఖైదు" అంటే జైలులాటిదికాదు. అదొక యమపురి....ఎవరూ ఊహించలేనంత ఘోర నరకకూపం........

అలాంటి కూపంలోనెల్లాళ్ళుండి, తిరిగి ప్రాణాలతో బైటపడ్డానంటే, ఆ దేవుడే ఆశ్చర్యపోతాడు సోదరా!!

నేను ఖైదీగా వున్నప్పుడు పొందిన అనుభవాల్ని తలుచుకుంటే ఏడుపొస్తుంది....ఆ జర్మనీవాళ్ళు పెట్టిన హింసలకు గురై, ఎంతోమంది చచ్చిపోయారు. ఆ చిత్రహింసల్ని తలుచుకుంటేనే చాలు గుండె బ్రద్దలౌతుంది సోదరా....

ఒక క్యాంప్‌నుంచి ఒకక్యాంపుకు, ఒకజైలునుండి మరో జైలుకు, తిప్పి, యించుమించుగా సగం జర్మనీఅంతా తిప్పారు నన్ను. నేను 'శక్సోనా'లో వున్నా. 'రూరర్' గనిలో బొగ్గు తవ్వాను....బవేరియా పొలాల్లో, బండ్లకొద్ది మట్టి తవ్వాను. ఒహ శేమిటీ, ఆ జర్మనీలో, నేను 'చెయ్యనిపనేలేదు....ఆ ముండాకొడుకులు చేసిన దారుణాలకు లెక్కేలేదు. చేతుల్లో ఏముంటె వాటితో పొడుస్తూ, ఇష్టమొచ్చినచోటల్లా బూట్లతోతంతూ, నోటికొచ్చినట్టల్లా బూతులు తిడుతూ, వాళ్ళుపెట్టిన యమయాతనలు తలుచుకుంటే గుండె ఆగినంతపనవుతుంది. ఆ రాక్షసులు నిర్దయగా, కాలుస్తూంటే హా హా కారాలు చేస్తూ కొన్నివేలమంది నేలకొరిగిన దృశ్యాలు తలుచుకుంటే, చలిజ్వరం వచ్చినట్టు వళ్ళంతా వణుకుతుంది....

అది అంత ఘోరం సోదరా. దాన్ని వర్ణించి చెప్పడం నాతరంకాదు.

నువ్వు రష్యన్‌వి అయినంతమాత్రాన నిన్ను కొట్టేవారు.... నువ్వింకా బ్రతికున్నందుకు, చిత్రహింసలు పెట్టేవారు....వాళ్ళు చెప్పినవైపు నువ్వు తిరగకపోయినా, వాళ్ళవైపు అదోలాచూసినా నాపని ఖాళీయే....అలావుండేది ఆ పరిస్థితి.

ఇంక తిండిసంగతి నేను వేరేచెప్పనక్కర్లే. ఎక్కడెళ్ళినా అదేరొట్టె పెట్టేవారు. రొట్టె అంటే ఏమోఅనుకునేవ్ ...రంపపు పొట్టు ఏదో పదిరకాలపిండీ కలపిన చెత్త. ఎక్కడో ఒకొక్క చోట పొరపాటున వేడినీళ్ళిచ్చారు....సాధారణంగా చన్నీళ్ళే........ చలిలో ఆనీళ్ళు తాగలేక చచ్చేవాళ్ళం....కొన్ని సమయాల్లో, ఆనీళ్ళు కూడా కరువొచ్చేది....ఇవన్నీ ఎందుకు?........ఒక్క విషయం చెప్తా విను. యుద్ధంలోకి రాకముందు నాబరువు 86 కిలోగ్రాములు తర్వాత చూస్తే 50 కి తక్కువే. దాన్నిబట్టి నువ్వే ఊహించుకో.... అప్పట్లో నావంట్లో ఎముకలు, చర్మం తప్ప మరేంలేదు. అసలు, ఆ ఎముకల గూడును లాగటానికైనా బలం ఉన్నట్టుండేదికాదు.... అయినా నోరుమూసుకుని చచ్చినట్టు పనిచెయ్యాల్సిందే....ఆరోజుల్లో మేంచేసేపని, బళ్ళలాగే దున్నలు కూడా చేయలేవంటే ఆశ్చర్యం కాదు....

(సశేషం)

## సోవియట్ దేశ భారత విద్యాధ్యయన వేత్తలకు ఉత్కళ గ్రంథ బహూకరణ

(19వ పుట తరువాయి)

సరు, ఒరియా సాహిత్య అకాడమీ సభ్యుడు అయిన శ్రీ రాజ్ కిషోరీ రాయ్ పాల్గొన్నారు.

అకాడమీ తరపున పండిత నీలకంఠదాసు గ్రంథాలను బహూకరిస్తూ, ఇది ఇంకా ప్రారంభమేననీ, సోవియట్‌దేశపు భారత విద్యాధ్యయనవేత్తలు ఒరియా భాషను అధ్యయనం చేయడానికి సహాయ పడేందుకు భవిష్యత్తులో సాధ్యమయినదంతా చేయగలమనీ తెలియజేశారు.

మొస్కలోవ్, గ్రంథాలను బహూకరించినందుకు పరిషత్తుకు కృతజ్ఞతను తెలుపుతూ, ఆ గ్రంథాలు సోవియట్‌దేశపు భారత విద్యాధ్యయనవేత్తలు మరొక భారతీయ భాషను నేర్చుకోడానికి సహాయ పడుతాయని అన్నారు.

# యుద్ధకాలపు సాహిత్యం

ఎల్. ఎకిమెన్కో

*డోసెంట్, మాస్కో విశ్వవిద్యాలయం, సోవియట్ దేశ రచయితల సంఘ సభ్యుడు*

సోవియట్ సాహితీ పురోగతి గురించి ప్రచురింపబడిన వ్యాసావళిలో యిది నాల్గవది. పూర్వపు వ్యాసం మా పత్రిక 20వ సంచికలో వెలువడింది.

క్షతినమైన ద్వితీయ ప్రపంచ యుద్ధకాల సారస్వత సమీక్షను, నాకు జ్ఞాపకం వున్న ఒక చిన్న సంఘటనతో ప్రారంభిస్తాను.

అది 1944వ వసంతకాలం అనుకుంటాను; నేనప్పుడు రైఫిల్స్ దళానికి వెళ్తున్నాను. ఒక విశాలమైన బయలుగుండా రోడ్డు పోతూ, ఒక దట్టమైన అరణ్యంలోనికి ప్రవేశించింది. ఇటీవలనే చంపబడినట్టుగా కనిపించిన ఒక గుర్రాన్ని దాటి నేను నడి



చాను. కొద్ది అడుగులకు ఆవల విరిగిన బండి ఒకటి వుంది. అంతటా అప్పుడే కారిన రక్తపు మడుగులున్నాయి. తుపాకిమందు పొగకంపుతో గాలంతా నిండిపోయింది. రోడ్డుకు దగ్గరగా ఎక్కడో తుపాకి కాల్పులు సాగుతున్నాయి. మైన్స్ యిక్కడా అక్కడా పేలుతున్నాయి.

అటువంటి సమయంలో నేను ఒక అసాధారణమైన దృశ్యాన్ని చూశాను. మడమలకు బురద అంటుకున్న టెంట్-కేప్, ఛాతీకి టామీ గన్ గల ఒక చిన్న సైనికుడు అడవిలోనుండి మెలమెల్లగా నావేపు వస్తున్నాడు. అతనొక పుస్తకం చదువుతూ, దానిపుటలను తిరగవేస్తూ తప్పటడుగులు వేస్తున్నాడు. అతను హటాత్తుగా ఆగాడు, ఆగి పకపకా నవ్వుతున్నాడు. ఇది చాలా వింతగా కనిపించి నేను అతనిని ఆపి, అడిగాను ఏమిటి చదువుతున్నావని. షొలొఖోవ్ "వారు తమ దేశం కోసం పోరాడారు" అన్న నవలలోని కొత్తగా ప్రచురింపబడిన ప్రకరణాలన్నాడాయన.

అటువంటి సమయంలో, అటువంటి స్థలంలో చదవడానికి యీ వ్యక్తికిగల గొప్ప ధైర్యమూ, స్థైర్యమూ, ఆత్మశక్తి చూసి ఆశ్చర్యపడ్డాను. తానెక్కడున్నాడో మరిపించివెయ్యగలిగేటట్టుగా ఒక సైనికునిలో ఆసక్తిని రేకెత్తించగల రచయిత గురించికూడా నేను ఆలోచించాను.

ప్రజల ఆశలలోనూ, శ్రమ జీవితంలోనూ, విశ్వాసంలోనూ నిజంగా జీవించే సారస్వతం మాత్రమే, యుద్ధకాలంలోని అత్యంత ఉద్రిక్త సమయాల్లో ఉత్సాహాన్ని పురికొల్పే సహచారి కాగలుగుతుంది. సోవియట్ సారస్వతం, అటువంటి సారస్వతం.

యుద్ధపురోజుల్లోనే అలెగ్జాండర్ త్వర్దొవ్‌స్కీ. యుద్ధరంగ పత్రికా విలేఖరిగా పనిచేస్తూ, సైనికుని గురించి తన ప్రఖ్యాత గ్రంధంలోని ప్రకరణాలను—"వాసిలీ తెర్కిన్" అన్న పద్య కావ్యాన్ని వ్రాశారు.

వెనుకకు తిరిగిచూసి, 1914 యుద్ధంలో తాము ఎందుకు ఎవరికోసం చనిపోతున్నామో తెలియకుండా యుద్ధరంగాలలో ధైర్యంగా మరణించిన అనామక రష్యన్ సైనికులను మనం జ్ఞాపకం తెచ్చుకున్నట్టయితే, ఇప్పుడు వారి వారసుడైన స్మోలెన్‌స్క్ మండలపు సమిష్టి రైతు వాసిలీ తెర్కిన్‌కు తాను రక్షించుకుంటున్నది తన కుటుంబాన్ని మాత్రమేకాదు, తన యింటిని మాత్రమే కాదని బాగా తెలుసునని మనం గ్రహిస్తాము. అతని దృష్టి యింకా విశాలమైనది, యింకా గొప్పది. అతనికి తన దేశం, తన సామ్యవాద మాతృదేశం అపారంగా అమూల్యమైనవి అయ్యింది. "నేడు మనమంతా రష్యాకు, ప్రజలకు, సర్వప్రపంచానికి బాధ్యులం" అన్న జ్ఞానంచే ఉత్తేజితుడతను.

ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ వ్యాసాలు యించుమించు ప్రతిరోజూ కేంద్ర పత్రికలలోనూ, యుద్ధరంగ, సైనిక పత్రికలలోనూ వెలువడ్డాయి, వాటిగల వాక్కు అన్న ఆయుధంతో అవి శత్రువులను చీల్చి చెండాడేయి, హిట్లరునూ, అతని సన్నిహిత సహచరులనూ, మానవత్వాన్ని పూర్తిగా కోలుపోయిన సామాన్య ఫాసిస్టు బంది పోటు దొంగలనూ రచయిత అపహాస్యంపాలు చేశారు.

ఎ. టాల్‌స్టాయి వ్యాసాలు గట్టి ఫలితాల నిచ్చాయి. అవకాశం

లోనూ, మహాకావ్యానికి వుండవలసిన వైభవంలోనూ, అవి పాత పాటలకు సన్నిహితమైనవి.

చాలామంది రచయితలు యుద్ధరంగంలో పోరాడేరు, తమ దేశ భవితవ్యం, ప్రపంచ భవితవ్యం, మానవకోటి భవితవ్యం నిర్ణయింపబడిన చోట్ల.

యఙా. తిఖనోవ్ తిరుగులేనివాణి లెనిఙాగ్రాడ్ నుండి మా వద్దకు వచ్చింది, ముట్టడింపబడిన ఆ నగరపు అపార ధైర్య స్థైర్యాల గురించి నెలవారిగా తెలియజేస్తూ.



ఇక్కడనే, దీపాలులేని ట్రాములు, బస్సులూ నడవడం లేని యీ నగరంలోనే, రోజూ పెద్ద తుపాకులు కమ్ముకుని వున్న యీ నగరంలోనే, ఆకలికీ చలికీ మనుష్యులు చనిపోయిన ఆ నగర వీధులలోనే వీరా ఇఙాబెర్ "ది పుల్కోవో మెరిడియన్" అన్న తనపద్యకావ్యాన్ని వ్రాశారు. దీనిలో ఉత్తేజకరమైన భావుకత. యదార్థమైన జీవిత దృశ్యాలు, నిజమైన మానవత స్వభావం గురించి నిశితమైన ఆలోచనలూ అందంగా అల్లుకొని వున్నాయి.

వేలాదిమంది యితర సోవియట్ ప్రజలవలెనే, రచయితలు తమ ఆప్తులనూ, ప్రేమాస్పదులనూ కోలుపోయారు. పి. అంతొకొవ్‌స్కీ అతి చక్కని పద్యాలలో ఒకటి, దుర్భర పితృ దుఃఖాన్నుంచి పుట్టినది. యుద్ధంలో హతుడైన, జూనియర్ లెఫ్టెనెంటైన తన కుమారుని స్మృత్యర్థం వ్రాసిన పద్యకావ్యమిది.

కవిత దుఃఖాన్ని ఉపశమింపజేయగలదో లేదో నాకు తెలియదు, వాస్తవానికి యీ విషాదాంత పద్యకావ్యంలో దుఃఖోపశమనం లేదు—అప్పటికే చనిపోయిన, భయంకర బాధా వ్యధతో చనిపోయిన తన ముద్దుబిడ్డకు, "అశేష హతమానవుల కాశ్రయమిచ్చిన" నేలపైని చిరుపాదాలతో అడుగులువేసే తన ముద్దుబిడ్డను మమకారంతో పిలిచిన పిలుపుతో సమాప్తం అవుతుంది యీ పద్యకావ్యం. యావత్ప్రజలూ అనుభవిస్తోన్న అనుభవంతో, దానిలో వ్యక్తిగతమైనదీ, సన్నిహితమైనదీ బాగా మిళితమైపోవడంవల్ల, యీ పద్యకావ్యం ఒక సాంఘిక, సారస్వత ఉదంతమయిపోయింది.

రెండు ప్రపంచాల మధ్య, నిర్మాణాన్నీ సృష్టినీ చేసే సామ్యవాద ప్రపంచానికీ దురాక్రమణనూ హింసనూ చేసే ఫాసిస్టు ప్రపంచానికీ మధ్యగల భేదం, విశాలమైన కవితా సామ్య మార్గాన వెల్లడి చేయబడినట్టుగా వుందిది.

యల్. లియొనోవ్ "దండయాత్ర" (1943) లో జరిగిన ప్రత్యక్ష సంఘర్షణ, యీ రెండు ప్రపంచాలమధ్య తేడాలను యింకా విస్పష్టంగా చూపుతుంది.

యల్. లియొనోవ్ నాటకం ఆదినుండీ తన్మయతను కలిగిస్తుంది. ఫెదొర్ దుబారాఖర్చులు చేసేవాడు, యీతనిని సోవియట్ న్యాయస్థానం శిక్షిస్తుంది, తన శిక్షాకాలం పూర్తి అయిన తరవాత యిటీవలనే ఖైదునుండి విడుదల అయి, ఫాసిస్టులు ఆక్రమించుకోబోతోన్న నగరంలో వున్న తన కుటుంబం వద్దకు వస్తాడు. అతని తండ్రి డాక్టర్ తలనోవ్, అతని తల్లి, అక్కచెల్లెలు ఫెదొర్ పట్ల జాగ్రత్తగా వుంటారు. దురాక్రమణదారుల పట్ల అతను ఎలా ప్రవర్తిస్తాడో, అతని నిజమైన సానుభూతి ఎవరి పక్షాన వుందో వారికి తెలియదు.



ఫెదొర్‌ను పరీక్షిస్తోన్న దృశ్యం చాలా ఉత్తేజకరంగా వుంటుంది. అతనొక జర్మన్ సైనిక దళాధిపతిని చంపాడు, తలనోవ్ కుటుంబంలో దాగివున్న, గెస్టపో వెతుకుతోన్న బోల్షివిక్ రహస్య బృంద నాయకునిగా అతను భావింపబడుతున్నాడు.

పరీక్ష సమయంలో డాక్టర్ తలనోవ్, అతని భార్య కొడుకు వద్దకు పిలువబడ్డారు. వారు అతనుచెప్పిన దానిని ధృవపరిచి, తప్పించుక తిరుగుతోన్న గెరిల్లా యోధుడు కొలెస్నికోవ్ యితనేనని అంటారు. అతిసున్నితమైన, నిశితమైన వివరాలద్వారా యీ నాటక కర్త, తమ కొడుకును మృత్యు ముఖానికి పంపుతూ వున్నప్పుడు తలిదండ్రుల భావాలను మనకుతెలియజేస్తారు.

సోవియట్ ప్రజల సాహస కృత్యాల, దేశభక్తి, నైతిక శక్తి సౌందర్యాల సంస్తుతి, యుద్ధకాలంలో రచింపబడిన అనేక గ్రంథాలకు వస్తువుగా వున్నాయి.

మాస్కో గెరిల్లా బాలిక జోయ కోస్మొదెమ్యాన్‌స్కయా సాహస గాథను వివరించే "జోయా" అన్న యం. అలిగెర్ పద్యకావ్యం ఉద్రేకపూరితమైన, ఉత్తేజభరితమైన గీతంగా ప్రతిధ్వనిస్తుంది.

ఎ. ఫెదయేవ్‌కూడా, "యువరక్షకుడు" అన్న రహస్య యువజన సంఘ వాస్తవిక అనుభవంపైని ఎన అద్భుతమైన ఉత్తేజకర కథను ఆధారపర్చి రచించారు. ఇది సోవియట్ దేశ యువజనుల తరాన్ని, వీరోచిత కృత్యాలను నెరవేర్చడానికి దానికిగల నిజమైన ఆకాంక్షనూ, ఆమరణాంతం పరాక్రమంతో పోరాడడానికి దానికిగల శక్తినీ కీర్తించింది.

కాని సారస్వతం, సాహసులను మాత్రమే పేర్కొనదు, ఫాసిస్టు దురాక్రమణదారుల మృగతత్వాన్నీ, వారి కర్కశత్వాన్నీ, అనుషత్వాన్నీ మాత్రమే వెల్లడించారు.

మా విజయ దినాన్ని శీఘ్రగతిలో సంప్రాప్తింపజేసిన సోవియట్ ప్రజలనుకూడా మా అద్భుతమైన, వాస్తవికమైన సారస్వతం చిత్రించింది.

సామ్యవాద వాస్తవికత గురించి మేము చెప్పేటప్పుడు, మమ్ములను మేము విమర్శించుకునే సామర్థ్యాన్ని, ప్రజా వ్యతిరేకమైన మా పురోగమనాన్ని ప్రతిఘటించే దానినంతట్నీ వెల్లడించడానికీ త్యజించడానికి గల సామర్థ్యాన్నీ విస్మరించకూడదు.

యుద్ధకాల సారస్వతాన్ని అసమగ్రంగానైనా సమీక్షించిన యీ రచనను మార్షల్ ఝకోవ్ మాటలతో ముగిస్తాను. విజయోత్సవ చిరస్మరణీయ సంవత్సరాన, 1945 లో, సోవియట్ రచయితలను ఉద్దేశించి యిలా అన్నారు: "తిరోగమిస్తోన్న రోజుల్లోనూ, విజయ దినాలలోనూ, మనం విషమ పరీక్షను ఎదుర్కొంటోన్న దినాలలోనూ, మన ఆనంద దినాలలోనూ సోవియట్ రచయితలు సర్వదా ప్రజలతో వున్నారు."



## సోవియట్ మహిళా మహోదయం

# న్యాయశీలి ఎమిలియా విన్‌బెర్గ్

—యసీనా మర్కులస్

ప్రతిభ అనుభవం, ప్రజలపట్ల ప్రేమానురాగాలు, గాఢమైన న్యాయ తత్పరత, ఇవి-జీవితాన్ని మలచుకోవడానికి లాత్వియా న్యాయ శాఖ మంత్రిణి, ఎమిలియా విన్‌బెర్గ్‌కు ఎంతో దోహద మిచ్చాయి.

రీగా పరిసర ప్రాంతంలో అరవై సంవత్సరాల క్రితం జన్మించి, 15వ ఏటినుంచే తండ్రి ఉద్యోగం చేస్తున్న, ఎలక్ట్రిక్ వైరును తయారుచేసే ఒక కర్మాగారంలో పనిచెయ్యడం ప్రారంభించింది.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో విన్‌బెర్గు కుటుంబం, వేలాది లాత్వియన్ కుటుంబాలలాగే ప్రాచ్యానికి తరలిపోవలసివచ్చింది.

ఆవిడ తండ్రి సైన్యంలో చేరాడు. ఎమిలియా తల్లి, చెల్లెలితో పాటు మాస్కోకు వెళ్ళవలసి వచ్చింది. అక్కడ ఆవిడ మంత్రసాని శిక్షణ పొందింది, ఆ తరువాత ఒక ఆసుపత్రిలో పనికి కుదిరింది.

విప్లవానంతరం నూతన ప్రభుత్వం, కళాశాల విశ్వవిద్యాలయ ప్రవేశానికి పూర్వం కార్మిక కర్షకులకని ఏర్పాటుచేసిన స్వల్పకాల శిక్షణ తరగతుల నడిపే పాఠశాలలో అధ్యయనం చేసింది.

ఈ కాలంలో, మొట్టమొదటిసారిగా ఆవిడ ప్రజా న్యాయ మూర్తిగా ఎన్నుకోబడింది, ఇది ఆవిడ తన సర్వశక్తులను ఆ న్యాయ వృత్తికి అంకితంచేసి కృషి చెయ్యాలనే ఒక దృఢ నిర్ణయానికి రావడానికి కారణమైంది.

మాస్కోలోని 'న్యాయశాస్త్ర సంస్థ' లోను, ఆ తరువాత విదేశ వ్యాపార పరిషత్తులోను అంతర్జాతీయ న్యాయశాస్త్రాన్ని అధ్యయనం చేసింది.

ఒకవైపు న్యాయ శాస్త్రాధ్యయనం సాగిస్తూనే, కొంతకాలం సోవియట్ దేశపు నూనె ఎగుమతుల సంఘానికి న్యాయశాఖా సలహాదారుగా పనిచేసింది. అన్నింటికన్నా అత్యధికంగా న్యాయ కార్య కృషి ఆవిడను ఎంతో ఆకర్షించినందువల్ల న్యాయస్థానపు పనులలోనే ఆవిడ పరిపూర్ణంగా నిమగ్నమైంది.

లాత్వియాకు తిరిగి వచ్చాక, ఆవిడకు బాధ్యతాయుతమైన పదవులివ్వబడ్డాయి. ప్రస్తుతపు ఈ మంత్రిత్వ నియామకం 1951లో జరిగింది.

ఆవిడను నేను సందర్శించిన నాటి, ఆవిడ దైనిక కార్యాను క్రమణికను చూస్తే బహుముఖమైన ఆవిడ విధులన్నీ ప్రతిబింబితమవుతున్నాయి.

కార్యక్రమం, లేదూ దినచర్య, సోవియట్ పార్లమెంటు ఇటీవలి సమావేశంలో న్యాయ విధానాన సంబంధంగా ఆమోదించిన ఒక నూతన న్యాయ చట్టాన్ని చర్చించటానికి జరుగనున్న సభతో ప్రారంభ మవుతున్నది.

ఈ నూతన చట్టం యూనియన్ రిపబ్లిక్కుల హక్కులను చాలావరకు విస్తృతీకరిస్తున్నది, సభలో ఈ చట్టంమీద ప్రతి అంశం తీవ్రంగా క్లాజువారీగా చర్చకు వచ్చింది.

12 గంటలకు మంత్రాంగ శాఖాధికారులతో సంప్రతింపులు, మధ్యాహ్న భోజనానంతరం ఆవిడ అక్రమాలకు, అన్యాయాలకు సంబంధించిన కార్మికుల వివాదాలపట్ల దృష్టి మరల్చి, వాటికి లక్ష్య



(మిగత 40వ పుటలో)

## రష్యా

*బీన్స్ క్రీం లేక బటాణీ సూపు:*

కావలసిన సామగ్రి : 400 గ్రాముల బీన్సు లేక బటాణీలు
1 క్యారట్ దుంప
1 ఉల్లిగడ్డ
4 చెంచాల వెన్న
2 గ్లాసుల పాలు

శుభ్రంగా బీన్స్‌ను కడిగి. చన్నీళ్ళలో వాటిని 5-6 గంటలు నానబెట్టాలి. ఆ తర్వాత వాటిని ఒక కుండలో వేసి, 4-5 గ్లాసుల నీళ్ళు పోసి, క్యారట్‌దుంప ముక్కలు కోసి అందులోవేసి, ఆ తర్వాత ఉల్లిగడ్డవేసి మామూలు పొయ్యిమీద 40-50 నిముషాలు బాగా ఉడికించాలి. బాగా ఉడికిన తర్వాత క్యారట్ దుంప ముక్కలూ, ఉల్లిగడ్డ అందులోనుంచి తీసేసి, తీగె జల్లెడతో వడకట్టాలి. అప్పుడు బీన్స్ పైకి తేలి సలసల మరుగుతున్న ద్రవం పాత్రలోకి పోతుంది. ఇప్పుడు ఈ ద్రవంలో వేడిపాలను పోసి, దానిలో తగినంత ఉప్పు వెయ్యాలి. ఇప్పుడు బీన్స్ క్రీమ్ తయారైంది. తినడానికి ముందు దీనిని వెన్నతో కలిపి యివ్వాలి.

బటాణీ సూపునుకూడా పైవిధంగా తయారు చెయ్యవచ్చు.

*రొట్టె-క్యారట్ వంటకం:*

కావలసిన సామగ్రి : టోస్టు చేసుకొనే గట్టిరొట్టె పిండికొట్టినది 2 చెంచాలు
1 క్యారట్ దుంప
$\frac{1}{4}$ గ్లాసు నీళ్ళు
$\frac{1}{2}$ కోడి గుడ్డు
$\frac{1}{2}$ చెంచా చక్కెర
$\frac{1}{2}$ చెంచా వెన్న

నల్ల పిల్లవాడు తెల్ల పిల్ల జోడు
కలసి మెలిసి వారు మాటలాడినారు...
నల్ల పిల్లవాడు 'చెల్లీ'యని పిలవగానె
తెల్ల పిల్ల చూడు 'అన్నా'యని అందుకొనెను.
నల్లటి ఆ తలకట్టూ రాగి రంగు జుత్తూ
చిరునవ్వుల గూడుకట్టె;
నల్లటి ఆ చిరుతవేళ్ళు, మెత్తని ఆ తెల్ల వేళ్ళు
కలసిపోయె కోమలముగ.

నల్ల చేతులకు తెల్ల చేతు
లొక్కటిగా గుచ్చెత్తెను
ఎర్ర గులాబీలను, నల్ల గొంతులు
తెల్లగొంతులు కలిసిపాడె శాంతిగీతి.
పలకరించు కొంటున్నారు
ప్రపంచ బాలలు, మరివారు
ఒకర్నొకరు పిలుచుకొనే
పరుసలు చెల్లీ అని, అన్నా అని.

—రెన్ ఫాక్స్

# వంటకాలు

శుభ్రంగా కడిగిన క్యారట్ దుంపను ఉడికించి, ముక్కలుచేసి, దానికి వెన్న చేర్చి మెత్తగా పిండి చెయ్యాలి. రొట్టె పిండిమీద వేడి నీరు పోసి, దానికి కోడిగుడ్డు వెన్న కలపాలి. ఆ తర్వాత దానిని బాగా కలిపి, చమురుగానున్న పెనంమీద అందులో సగం పిండిముద్ద పెట్టి, దానిమీద పరుస కట్టినట్టు ఒత్తుగా క్యారట్ పిండిముద్ద పెట్టి, మిగిలిన సగపు రొట్టెపిండి దీనిపైన కూరి బాగా కాల్చాలి.

*వేపిన గుమ్మడి, బంగాళా దుంపలు:*

300 గ్రాముల గుమ్మడిని, 300 గ్రాముల బంగాళా దుంపలను, 50 గ్రాముల వెన్న, 50 గ్రాముల పులిసిన మీగడ, 1 చెంచా పిండి తీసుకోవాలి. గుమ్మడిని చెక్కలు చెక్కలుగా తరగాలి. దానికి తగినట్టు ఉప్పురాసి, పిండిలో చెక్కలకన్నింటికీ సమంగా పిండి పట్టేట్టు వాటిని దొర్లించాలి. బాగా కలియబెట్టినట్టు తిప్పి కొవ్వుతో ఆ తరువాత వేయించాలి. బంగాళా దుంపలను ఉప్పు నీటిలో బాగా ఉడికించాలి. ఉడికిన తర్వాత కరిగిన వెన్నను, సోంపును కలపాలి. తినడానికి ముందు ఆ బంగాళా దుంపలమీద వేసిన గుమ్మడిచెక్కలు పెట్టి, దానిమీద పులుపు మీగడ వెయ్యాలి.

*వేపిన గుమ్మడి*

500 గ్రాముల గుమ్మడి, ½ చెంచా వెన్న, 1 చెంచా పిండి, ½ కప్పు పులుపు మీగడ, మిరియాలు సమకూర్చుకోవాలి.

గుమ్మడిని వొలిచి, విత్తనాలు ఏరేసి, పల్చటి చెక్కలుగా కొయ్యాలి. దానికి ఉప్పు మిరియపు పొడి రాచి, వాటిని పిండిలో బాగా పొర్లించాలి. బాగా కొవ్వులో వేయించాలి. పైన తెట్టెకట్టే వరకు వేయించి, పొయ్యిమీద కాల్చాలి. తినడానికి ముందు పులుపు మీగడ కలుపుకోవాలి.

# తెలివితక్కువ దయ్యం

దేవుడన్నా దయ్యమన్నా భయంలేని పంచకురాలైన ఒక యువతి. ఒకానొకప్పుడు దయ్యానికి అంత ఉపకారం చేసింది.

ఏమైనా చేసిన ఉపకారం ఊరకపోతుందా, దానికి కృతజ్ఞతగా దయ్యం ఇట్లాఅన్నది :

"అమ్మా, నీ ఉపకారబుద్ధికి మెచ్చుకున్నాను. నువ్వల్లా, ఏదైనా ఒక కోరిక కోరుకో, అది వెంటనే సంతోషంగా నెరవేర్చబడుతుంది."

ఆ యువతికి ఏం కోరుకోవాలో ఎంతసేపటికీ తోచకపోతే సంగతంతా ఎరిగిన దయ్యం ఆమెకు చేదోడుగా సలహా యిచ్చింది. దయ్యం దృష్టిలో స్త్రీకి అత్యవసరమనిపించింది చక్కదనం.



"నీకు చక్కని చుక్కవు కావాలని వుందా? చెప్పు. వెంటనే నిన్ను నేను సుందరిని చేసేస్తాను."

దానికి ఆ యువతి జవాబుగా దయ్యానికి గూబ గుయ్యమనిపించింది.

"అబ్బ ఏమిటి నీ సాహసం! దద్దమ్మా, అంత అందంగా లేనా?!"

"దాని వయస్సు నాలుగేళ్ళు, కాని రెండేళ్ళంటూంది. మంచి వగలాటి తనమే" అని వుంది ఇల్యా ఇల్ఫ్ "నోట్ బుక్"లో.

"ఆమె చాలా ముచ్చటగావుంది, మా కుక్కంత ముచ్చటగా!" అంది ఒక చిన్న అమ్మాయి తన మేనత్తను వర్ణిస్తూ.

"దేనికీ సమయం లేకుండా వుండాలంటే, ఏదీ చేయకండి"— అంతవ్ చెకోవ్.

* * *

లొమొనొసోవ్ కోటుకు మోచేతివద్ద చిరిగిపోయింది.

"మీకోటు చేతులగుండా పాండిత్యం పైకి తొంగిచూస్తోంది!" అన్నాడు ఒక రాజాస్థానపు బడాయికోరు.

"మీరన్నది తప్పు" అని ఆ ప్రఖ్యాత విజ్ఞానశాస్త్రవేత్త బదులు చెప్పారు, "తెలివి తక్కువతనం లోపలికి చూస్తోంది!"

# టర్నిప్ దుంప



తాతయ్య ఒక టర్నిప్ నాటాడు. ఇంక దానిని పెరుకవలసిన తరుణం కూడా వచ్చింది. దాన్ని గట్టిగా పట్టుకొని గుంజడం మొదలుపెట్టాడు తాత. ఎంత గుంజినా అది రాలేదు.

తాత అప్పుడు అవ్వను పిలిచాడు.

అవ్వ, తాత చెయ్యిపట్టుక గుంజింది, తాత దుంపను పట్టుకొని గుంజాడు. ఎంత గుంజినా వాళ్ళు దాన్ని పెకలించలేక పొయ్యారు.

ఆ తర్వాత వాళ్ళ మనుమరాలు వచ్చింది. ఆ పిల్ల, అవ్వనూ అవ్వ తాతనూ, తాత దుంపనూ పట్టుక గుంజారు. అందరూ కలిసి గట్టిగా గుంజారు, అయినా అది కదిలింది కాదు.















ఆ తర్వాత కుక్కపిల్ల వచ్చింది. అది మనుమరాలిని పట్టుకొంది. మనుమరాలు అమ్వనూ, అవ్వ తాతనూ, తాత దుంపనూ పట్టుక గుంజారు. ఎంత గుంజినా దానిని పెకలించలేక పోయ్యారు.

ఆ తర్వాత పిల్లి వచ్చింది. పిల్లి కుక్కపిల్లనూ, కుక్కపిల్ల మనుమరాలినీ, మనుమరాలు అవ్వనూ, అవ్వ తాతనూ, తాత దుంపనూ పట్టుక గుంజారు.

అందరూ ఎంతలాగినా అది కదల్లేదు.

అప్పుడు ఎలుక వచ్చింది. ఎలుక పిల్లినీ, పిల్లి కుక్కపిల్లనూ, కుక్కపిల్ల మనుమరానీ, మనుమరాలు అవ్వనూ, అవ్వ తాతనూ, తాత దుంపనూ పట్టుక గుంజారు. గుంజీ, గుంజీ చిట్టచివరకు దానిని పెకలించారు.







## న్యాయశీలి ఎమిలియా విన్‌బెర్గ్

(36వ పుట తరువాయి)

మివ్వవలసి వచ్చింది.

ఆనాటి మధ్యాహ్నం ఆవిడ ఒక కోర్టు విచారణకు హాజరయింది కూడా. నృత్యనాటక ప్రదర్శనలలో అత్యంత అభిరుచి కలిగి వుండడంవల్ల, అభిమాన ప్రేక్షకురాలు కావడంవల్ల సాయంత్రము లాత్వియన్ నృత్య ప్రదర్శన 'లెయ్‌మా'ను చూడడానికి వెళ్ళింది. తీరికంటూ లేని జీవితం!—అవును, అయినా ఎంతో ఆసక్తిదాయకమైన జీవితం. లాత్వియన్ ప్రభుత్వ విశ్వవిద్యాలయంలో ఉపన్యాసాలివ్వడం, ఇటీవల, ఒత్తిడైన ఇతర కార్యభారాల దృష్ట్యా ఆవిడ విరమించుకోవలసి వచ్చింది.

ఆవిడ లాత్వియన్ పార్లమెంటు సభ్యురాలు. అంతర్జాతీయ మహిళా సమావేశాలలో పాల్గొనడానికిగాను తరచు ఆవిడ విదేశాలకు పోతుంటుంది.

మొన్నటి యుద్ధంలో వాళ్ళ స్వగృహం విధ్వంసం గావించబడింది. ఆ యుద్ధ సమయంలోనే భర్తకూడా మరణించాడు. అందుచేత ఎమిలియా విన్‌బెర్గ్ ఇప్పుడు, ఇద్దరు కొడుకుల తల్లియైన తన చెల్లెలితోపాటు చెలెలి యింట్లోనే వుంటున్నది.



సోవియట్ రాయబారి
కార్యాలయంలో విందు దృశ్యం

★

మహత్తర అక్టోబర్ సామ్యవాద విప్లవ 40వ వార్షికోత్సవ సందర్భంగా సోవియట్ రాయబారి మిస్టర్ ఎం. ఎ. మెన్షికోవ్ విందుచేశారు. రెండు వేలమందికి పైగా అతిథులు విచ్చేసిన ఈ విందులో ప్రముఖులు, భారత ఉపాధ్యక్షుడు శ్రీ ఎస్. రాధాకృష్ణన్, భారత ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ పాల్గొన్నారు

ఛాయాచిత్రం: ప్రధానాతిథులలోవున్న సోవియట్ రాయబారి

## ఈ సంచికలో



ముందు అట్ట: మాస్కో విశ్వవిద్యాలయ విద్యార్థులు కతియా ఎరెమీవా, లెబనాన్, ఈజిప్టు నుంచి విచ్చేసిన తన సహాధ్యాయులతో.

వెనుక అట్ట: పరిసర సమిష్టిక్షేత్రాల వ్యవసాయపు క్రమాలన్నింటినీ విద్యుదీకృతం చేయుటకు తోడ్పడిన గెర్జెలిన్స్కయా జల విద్యుత్కేంద్రం (దఘిస్తాన్ స్వపరిపాలక రిపబ్లిక్ కకాసస్.)

## రాబోవు సంచికలో

మా విలేఖరులు ఐ. అగ్రనొవ్‌స్కీ, వి. పొల్యనిన్, ప్రాచీన ఊరల్ ప్రాంతపు ఇటీవల వెలసిన పెద్దపెద్ద ఉక్కు మిల్లుల, కొత్త పట్టణాలగుండా మా పాఠకులను పర్యటింపజేస్తారు. ఊరల్స్, భారత దేశాల మధ్యన నవీన స్నేహ సంబంధాలు పెంపొందుతున్నాయి. ఊరల్ మిల్లులు భారత దేశంలోని భిలాయ్ కర్మాగారానికి అత్యధికంగా యంత్ర నిర్మాణం చేస్తున్నాయి.

రాబోవు సంచికలో, యథారీతిన వెలువడే ఆకర్షణీయమైన శీర్షికలతోపాటు. సోవియట్ దేశ ప్రసిద్ధ ప్రాచ్య విద్యాధ్యయనవేత్త ఎకడమీషియన్ ఒర్బెలీ రచించిన లెనిన్‌గ్రాడ్‌లో భారతీయ విద్యాధ్యయన చరిత్ర గురించి ముఖ్య వ్యాసం వుంటుంది.

**మీ ప్రతికై త్వరపడండి!**

# ప్రపంచమంతటా ప్రకాశిస్తోన్న చందమామ



డేనిష్ చిత్రకారుడు: బిద్స్ట్రూప్

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్ చే 25, బారాకంబా రోడ్, న్యూఢిల్లీ నుండి సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు: పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ—6.

